ఓం

శ్రీ రాజరాజేశ్వర్యై నమః.

బాలుర కత్యంతోపయుక్తంబగు

# అర్ఘప్రదర్శిని.

(జ్యోతిష గ్రంథ రత్నము)

ఇది

మచిలీపట్టణ వాస్తవ్యులును, సుప్రసిద్ధులు నగు

చల్లా లక్ష్మీనృసింహ శాస్త్రిగారిచే

ఆంధ్ర తాత్పర్యసహితముగా వ్రాయఁబడి,

వారి ద్వితీయపుత్రులు

నాగేశ్వరశాస్త్రిచే

స్వకీయ

శ్రీ ఆర్యానంద ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రకటింపఁబడియె.

మచిలీపట్టణము.

(తృతీయ ముద్రణము 500 ప్రతులు)

 1958. దీనివెల 10/-

# విషయానుక్రమణిక.





విషయములు సమాప్తము.

# పీఠిక.

సర్వశాస్త్రములలో జ్యోతిషము ఈశ్వరనిర్మితమై భూతభవిష్య ద్వర్తమానంబులఁ దెలుపునట్టిది.

శ్లో॥ విఫలాన్యన్యశాస్త్రాణి వివాదాస్తేషు కేవలమ్ ।
సఫలంజ్యోతిషంశాస్త్రం చంద్రార్కౌయత్రసాక్షిణౌ ॥

అను ప్రమాణమువలన వేదపురుషుని షడంగములలో ముఖ్యాంగమైన జ్యోతిశ్శాస్త్ర మొక్కటియే ఫలసాధకశాస్త్రమైన దనియును, విరాట్స్వరూపుని మనో నేత్రములం దుద్భవిల్లిన చంద్ర సూర్యులు సాక్షులుగానుండుటఁబట్టి సర్వోత్కృష్టమైన శాస్త్రముగాఁ జెప్పఁబడినది. ఈశాస్త్రమున కధిదేవతయగు శ్రీ సూర్యనారాయణమూర్తి మొదట మయుఁడనెడు రాక్షసశ్రేష్ఠున కనుగ్రహించినయట్లును, తదనంతర మది భువిలో విలసిల్లి,

శ్లో॥ సూర్యః పితామహోవ్యాసః వసిష్ఠాఽత్రిపరాశరాః ।
కశ్యపోనారదోగార్గ్యో మరీచిర్మనురంగిరాః ॥
లోమశోపౌలశ్చైవ చ్యవనోయవనోభృగుః ।
శౌనకాఽష్టాదశస్యైతే జ్యోతిశ్శాస్త్రవిశారదాః ॥

అనెడు శ్లోకమునందు పేర్కొనినవారివలనను, మఱి కొందఱు ఋషులవలనను వృద్ధిపొందింపఁబడి ముందు సిద్ధాంతభాగమును విభాగింపఁజేసిరి. పరబ్రహ్మము తన మాయాశక్తివలన పంచభూతస్వరూపములగు నక్షత్రములుగాను, సూర్యాది గ్రహమండలంబుగాను అవతరించెననెడి ప్రమాణము లనేకములుగలవు కనుక పరబ్రహ్మ స్వరూపమయిన జ్యోతిషముఁ జదువ నభిలాష గలవారు భచక్ర స్వరూపమయిన నక్షత్రములయొక్కయు, సూర్యాది గ్రహముల యొక్కయు స్వభావమును, గతిని, గుణ ధర్మములను జక్కఁగా పరిశీలింపవలెను. వాని గుణధర్మములు భూగోళమునందు వ్యాపించి

సందున నిచ్చట గ్రహ ప్రవేశములవలన ఆయాకాలములకు గ్రహములే కారకు లగుచున్నారని తెలియఁబడుచున్నది కనుక వానిఁ దెలిసికొనుటకై ప్రథమములో జ్యోతిశ్శాస్త్రము నభ్యసించుట ముఖ్యావశ్యకంబని జెప్పుటకు సందేహములేదు. మరియు సర్వకాలములయందు గ్రహ ప్రవేశాదులవలననే అర్ఘ్య లేర్పడుచున్నవిగదా! ఆకాలమునకు అర్ఘ్యలు అనగా అత్యర్ఘ్య, సమార్ఘ్య, శూన్యార్ఘ్య మొదలగు వానివానియొక్క వస్తుఫలములు బహువిపులముగా మహర్షులు వ్రాసియుండిరి. ఆగ్రంథములలో కొన్ని ముఖ్యగ్రంథములు అఱవ ద్రావిడ దేశములలో ప్రాచీనతాళపత్రములయందుండుటచే వానిలో ముఖ్యవిషయములుసంపాదించిమాపితామహుడైన నాగలింగశాస్త్రిల వారు బహు శ్రద్ధతో వ్రాసి చిరకాలము వ్యాసంగముచేసి ఫలాఫలము లితరులకు చెప్పుటను మాతండ్రిగారగు లక్ష్మీనృసింహశాస్త్రి గారుచూచి అర్ఘ్యప్రదర్శినినామముతో నిప కూర్పు ముద్రింపించిప్రచురించిరి దానికి తృతీయ ముద్రణము

ఆర్యానందప్రెస్,
మచిలీపట్టణము.

ఇట్లు,
చల్లా నాగేశ్వర శాస్త్రి.



ఓమ్

శ్రీ రాజ రాజేశ్వర్యైనమః

# అర్ఘప్రదర్శిని.

అను జ్యోతిషగ్రంథ ప్రారంభము.



## ఇష్టదేవతా ప్రార్థనము,

శ్లో॥ వందే విశ్వేశ్వరం దేవం గణనాథంగజాననమ్ ।
ధ్యానేనయస్యప్రత్యూహా విలయంయాంతిదూరతః ॥

తా॥ ధ్యానముచేయుటమాత్రముచేతనే సకలవిఘ్నములను దొలగించువాఁడును, ప్రపంచమున కీశ్వరుఁడును, గణాధిపతియును, ప్రపంచమునకు సర్వమునకు నధిపతియును, ఏనుఁగుయొక్క ముఖముగలవాఁడున్నునగు విఘ్నేశ్వరునకు నమస్కారముజేసెదను.

శ్లో॥ ఆదిత్యప్రముఖాః ఖేటా స్తథామేషాదిరాశయః ।
లోకానాముపకర్తారః పాంతుమామిహసర్వదా ॥

తా॥ సూర్యుఁడు మొదలుగాఁగల గ్రహములును, మేషము మొదలగు రాసులును లోకములకు మేలునుగలుగ జేయునట్టి స్వభావముగలవగుటవలన నాకు సర్వకాలములందు రక్షకులగుదురని తా॥

శ్లో॥ సప్తవింశతితారాణా మశ్వ్యాదీనాంపృథక్పృథక్ ।
పాదైశ్చతుర్భిర్గగనే శింశుమారంప్రతిష్ఠితమ్ ॥

తా॥ నాలుగుపాదములుగల అశ్విన్యాది ౨౭ నక్షత్రములకును ఆకాలమందు భగవంతునిచేత నివాసయోగ్యమగు శింశుమారమను పేరుగల చక్రమొకటి నిర్మింపఁబడెనని తా॥

శ్లో॥ ప్రాక్ప్రాగ్గతోడుచక్రంత దష్టోత్తరశతాంఘ్రికం ।
ప్రత్యఙ్ముఖంచలత్యేవ మేరోర్నిత్యంప్రదక్షిణమ్ ॥

తా॥ నక్షత్ర చక్రము ప్రాగ్భాగమునందు నూట యెనిమిదిపాదముల ప్రమాణముగలదై నిర్మింపఁబడినది. అది ప్రత్యఙ్ముఖముగా మేరుపర్వతమునను ప్రదక్షిణక్రమముగ దిరుగుచుండునని తా॥

శ్లో॥ జ్యోతిశ్శాస్త్రవినిశ్చిత్య హోరికంఫలమీరితం।
ఇష్టానిష్టపరిజ్ఞానా దనిష్టస్య ప్రశాంతయే।
ఇష్టసాధనసిద్ధ్యర్థ ముపాయోయంప్రదర్శితః॥

తా॥ జ్యోతిశ్శాస్త్రమును జక్కఁగ నాలోచించినయెడల శుభాశుభఫలములు జక్కఁగ దెలిసికొనవచ్చును మనకు దెలియఁబడకయే వచ్చునట్టి శుభాశుభములను దెలిసికొనుటకు భగవంతుఁడీశాస్త్రమును నిర్మించెనని తా॥

## అథ గురు ప్రార్థనమ్.

శ్లో॥ చింతావంశపయఃపారా వారరాకాసుధాకరం।
వందే వేంకటనారాయ ణాఖ్యసిద్ధాంతిసద్గురుమ్॥

తా॥ అస్మ ద్గురువులగు బ్రహ్మశ్రీ చింతా వేంకటనారాయణ సిద్ధాంతిగారికి గ్రంథకర్త నమస్కారముఁ జేసెనని తా॥

శ్లో॥ మచిలీపట్టణే చల్లా నాగలింగార్యసూనునా।
లక్ష్మీనృసింహవిదుషా కృతాచార్ఘప్రదర్శినీ॥
నమయాకల్పితా కించి త్ప్రాచీనై రేవకీర్తితా।
సంగృహ్యత త్తచ్ఛాస్త్రేభ్యో బాలబోధాయసాకృతా॥

తా॥ మచిలీపట్టణంబున చల్లా నాగలింగశాస్త్రులవారి పుత్రుఁడగు లక్ష్మీనృసింహశాస్త్రిచే అర్ఘప్రదర్శినియను నామంబుగల యీ గ్రంథము బాలురకొఱకుగాను ప్రాచీనజ్యోతిష గ్రంథాదులను క్రోడీకరించి మూలశ్లోకములన్నియును పాఠక్రమముగా ఆంధ్రతాత్పర్య సహితముగా ముద్రింపించి ప్రకటింపఁబడెను. ఈగ్రంథమునందు గ్రంథకర్త కల్పించినది కొంచెమైననులేదని తా॥

## గ్రంథ పరిసమాప్తదిన నిర్ణయః.

శ్లో॥ షడ్వేద గజ చంద్రేషు శాలివాహగ తేషుచ।
రక్తాక్షి వత్సరే జ్యేష్ఠ పూర్ణిమా భౌమవాసరే॥

తా॥ ౧౮౪౬ సంవత్సర శాలిశకముగతమగుచుండగా శ్రీరక్తాక్షి నామ సం॥ జ్యేష్ఠ శు ౧౫ భౌమవాసరంబున యీగ్రంథము సంపూర్తి చేయఁబడినదని తా॥

# అశ్విన్యాది నక్షత్ర శని సంచార ఫలములు.

అశ్విని ॥శ్లో॥ అశ్విన్యాంచగతస్సౌరిః తిలతైలంచభిత్తలం । మహార్ఘం మాసమేకంచ పునశ్శస్త్రాభిజాయతే ॥

తా॥ శని అశ్వినియందు వచ్చినప్పుడు నువ్వులనూనెకు, పిత్తలముకు ఒక నెలరోజులు ధరలధికమగును పిమ్మట తగ్గును.

భరణి ॥శ్లో॥ భరణ్యాంచైవఋక్షేతు రవిపుత్రోహిసంస్థితః। భ్రాతౄణాంప్రాగ్భవేద్యుద్ధం రాజ్ఞాంచైవమహద్భయమ్ ॥

తా॥ శని భరణికివచ్చినప్పుడు తూర్పు దేశమందుండు అన్నదమ్ములకు పరస్పరకలహములు, రాజులకు యుద్ధమున్ను జరుగును.

కృత్తిక ॥శ్లో॥ కృత్తికాంచగతస్సౌరి రశేషాణిధనానిచ । సుభిక్షంచ భవేత్తత్ర వస్త్రలాభశ్చతుర్గుణః ॥

తా॥ శని కృత్తికయందున్నప్పుడు సమస్తద్రవ్యములు సుభిక్షముగనుండును. కట్టలుమాత్రము ౪ రెట్లు ధరగలిగినవగును.

అత్రవిశేషః ॥శ్లో॥ అశ్విన్యాంచభరణ్యాంచ కృత్తికాయాం తథైవచ। భూమిపుత్రోయదాచాసీ త్సౌఖ్యంచైవవినిర్దిశేత్ ॥

తా॥ శని అశ్విన్యాది మూడు నక్షత్రములందున్నప్పుడు ప్రజలకు సౌఖ్యము కలుగును.

రో-మృ ॥శ్లో॥ రోహిణీ మృగశీర్షేచ సూర్యపుత్రో యదాభవేత్ । కుంజరాఃప్రళయంయాంతి సర్వవస్త్రమహార్ఘతా ॥

తా॥ శని రోహిణీ మృగశీర్షలందున్నప్పుడు ఏనుగులునశించును. సమస్తవస్త్రములకు ధరలుగలిగియుండును.

ఆర్ద్ర ॥శ్లో॥ ఆర్ద్రాయాంచ యదా సౌరీ సర్వధాన్యస్య సంగ్రహః । ద్వితీయేతృతీయేమాసే ద్విగుణంలాభమాదిశేత్ ॥

తా॥ శని ఆర్ద్రయందున్నప్పుడు సమస్తధాన్యములను ఖరీదుచేయవలెను. ౨-3 మాసములకు రెట్టింపులాభముగలుగును.

అత్రవిశేషః ॥శ్లో॥ ఆదిత్యశ్చ తథాభౌమ ఆర్ద్రాయాంచ గతాఉభౌ। మహార్ఘమేకమాసేన పునశ్శస్త్రాభిజాయతే ॥

తా॥ రవికుజులు ఆర్ద్రయందున్నప్పుడు ౧ నెల ధరలధికమగును-తర్వాత తగ్గును.

పున-పుష్య ॥శ్లో॥ పుష్యేపునర్వసౌచైవ యదిసౌరిః ప్రజాయతే । సస్యే సుఖంచదుఃఖంచ తేసకాలః ప్రవర్తతే ॥

తా॥ శని పుష్యమికి వచ్చినప్పుడు సుఖముగా సస్యాభివృద్ధి గలుగును. పునర్వసుకు వచ్చినప్పుడు దుఃఖముతో కూడియుండును.

ఆశ్రేష ॥శ్లో॥ ఆశ్రేషాయాం యదాసౌరిః తదావృష్టిర్నివార్యతే । ధనుషఃసారఖడ్గస్య నూనంచైవమహార్ఘతా ॥

తా॥ శని ఆశ్రేషకు వచ్చినప్పుడు వర్షము కురవదు. యుద్ధముసంభవించును.

మఘ ॥శ్లో॥ మఘాయాంచయదాసౌరిః సభయందీయతేతదా । కుంజరంహయవాణిజ్యం లాభంచైవవినిర్దిశేత్ ॥

తా॥ శని మఘయందున్నప్పుడు భయముగలుగును. ఏనుఁగులకు గుఱ్ఱములకు ధరలు జాస్తీయగును.

అత్రవిశేషః ॥శ్లో॥ ఆదిత్యాదిగ్రహాః పంచ సౌరిసంగే యదాస్థితాః । సర్వధాన్యంమహార్ఘంచ నాత్రకార్యావిచారణా ॥

తా॥ సూర్యుఁడు, చంద్రుఁడు, కుజుఁడు, బుధుఁడు, బృహస్పతి శనితో కూడియున్న యెడల సమస్త వస్తువులకు ధర లతిశయిల్లును. సందేహము లేదని తా॥

పూఫ-ఉఫ ॥శ్లో॥ యదా మార్తాండతనయః పూర్వాఫల్గుణి సంస్థితః । చింతావస్థాద్విజాస్సర్వే పృథివ్యాందారుణంభయమ్ ॥

తా॥ శని పూర్వాఫల్గుణీ ఉత్తరఫల్గుణీలయందున్నప్పుడు బ్రాహ్మణులకు చింతగలుగును. భూమియందు భయము సంభవించుచుండును.

హస్త ॥శ్లో॥ హస్తేజీవస్తదారాహుః శనిర్వాపిభవేద్యదా । నృపశ్చ దుఃఖితోనాథో జాయతేనాత్రసంశయః ॥

తా॥ హస్తయందు శని గురు రాహువులున్న యెడల రాజు అనాథుఁడై దుఃఖించును. సందేహములేదు.

చిత్రా ॥శ్లో॥ చిత్రాయాంచ యదాసౌరిః ప్రపశ్యతి యదాభవేత్ ।
మహార్ఘంభవతేనిత్యం లాభశ్చైవచతుర్గుణః ॥

తా॥ శని చిత్రయందుండినగాని, చూచినగాని ధరలధికమగును. కొన్నవారికి నాలుగురెట్లు లాభముకలుగును.

స్వా-విశా ॥శ్లో॥ స్వాత్యాం విశాఖాబుక్షేచ యదాసౌరిఃప్రగచ్ఛతి ।
చలంతితత్రభూపాలా నాస్తికించిద్విచారణా ॥

తా॥ శని స్వాతి విశాఖలం దున్నయెడల రాజులు స్వస్థానభ్రష్టుల గుదురని తా॥

అత్రవిశేషః ॥శ్లో॥ స్వాత్యాంసౌరిర్యదాభౌమా రేవతీంచగతోరవిః ।
చాలితా స్తత్రభూపాలా నాత్రకార్యావిచారణా ॥

తా॥ శని కుజులు స్వాతియందును, రవి రేవతియందును ప్రవేశించినచో రాజులు స్థానభ్రష్టులగుదురు. సందేహములేదు.

అనూ-జ్యేష్ఠ ॥శ్లో॥ అనూరాధాంగత స్సౌరిః జేష్ఠాయాంపరివర్తతే ।
పశ్చిమేదారుణోఘోరః సంహార స్తత్రజాయతే ॥

తా॥ శని అనూరాధ జ్యేష్ఠలందున్నప్పుడు పశ్చిమదిక్కున భయంకరమైన యుద్ధముగలుగును.

మూల ॥శ్లో॥ మూలే సౌరి ర్బుధఃస్వాతౌ వార్ద్రాయాంచైవసంస్థితః ।
సంగ్రహేసర్వధాన్యానా మగ్రేలాభశ్చదీయతే ॥

తా॥ శని మూలయందును, బుధుడు స్వాతియందుగాని, ఆర్ద్రయందుగాని యున్నప్పుడు సమస్తధాన్యములకు అంతమందు లాభము గలుగునని తా॥

పూషా ॥శ్లో॥ యదా మార్తాండతనయః పూర్వాషాఢేపి జాయతే ।
లోకానాంచైవసర్వేషాం కాష్ఠలాభశ్చతుర్గుణః ॥

తా॥ శని పూర్వాషాఢ యందున్నప్పుడు సమస్త లోకములందు కట్టెలవెల యధికమగును.

ఉషా ॥శ్లో॥ ఉత్తరాషాఢకేసౌరిః సప్తమాసేహి భాస్కరః। పానీయస్య
ళయంకుర్యాత్ వహ్నినాచమహీభవేత్ ॥

తా॥ శని ఉత్తరాషాఢకు వచ్చిన ౭ మాసములకు సూర్యుఁడు సమస్తమైన యుదకమును పీల్చును. భూమియం దగ్నిసంభవించును.

శ్రవణమ్ ॥శ్లో॥ యదా శ్రవణ ఋక్షేతు కోపికూరో భవిష్యతి । తత్ర
చాన్నం మహార్ఘంచ గోధూమస్య విశేషతః ॥

తా॥ పాపగ్రహములు శ్రవణనక్షత్రమునకు వచ్చినప్పుడు ధాన్యమునకు గోధుమలకు ధరలధికముగనుండును.

ధనిష్ఠ ॥శ్లో॥ యదా ఋక్ష ధనిష్ఠాయాం సూర్యపుత్రోఽపి జాయతే ।
సర్వధాన్యమహార్ఘంచ వృష్టిస్తత్ర భవిష్యతి ॥

తా॥ శని ధనిష్ఠయందుండునప్పుడు సమస్తధాన్యములకు ధరలు జాస్తీయగును. వర్షము తగ్గియుండునని తా॥

అత్రవిశేషః ॥శ్లో॥ మంగల సౌరి శుక్రౌచ ధనిష్ఠాయాంస్థితాయది ।
గర్జితాశ్చనవర్షంతి తోయబిందుంపయోధరాః ॥

తా॥ శని శుక్ర కుజులు ధనిష్ఠయందున్నప్పుడు మేఘములు గర్జితములుచేయునుగాని భూమియందు వర్షము కురవదని తా॥

శతభిషం ॥శ్లో॥ శతభిషంచ యదా జీవ శ్చిత్రాయాంచ భవేత్కుజః ।
మహార్ఘంచాన్నగోధూమాః పూర్వాదీనాంచతుర్దిశమ్ ॥

తా॥ బృహస్పతి శతభిషమందును, అంగారకుఁడు చిత్రయందును సంచరించుచున్నప్పుడు నాలుగుదిక్కులందు గోధూమాది ధాన్యములకు ధరలధికమగును.

పూ॥భా ॥శ్లో॥ పూర్వాభాద్రపదా ఋక్షే యదా సౌరిశ్చ సంస్థితః ।
మేఘశ్చవర్షతే తత్ర లోకానాంచహితాయవై ॥

తా॥ శని పూర్వాభాద్రకు వచ్చినప్పుడు లోకానుకూలముగా వర్షములు కురియును.

ఉభా-రేవ ॥శ్లో॥ ఉత్తరాభాద్ర ఋక్షేచ రేవత్యాంచ తథైవచ ।
రాజ్ఞోభయంమృతానాంచ లోకానాం వ్యాధిపీడనమ్ ॥

తా॥ శని ఉత్తరాభాద్ర రేవతులందున్నప్పుడు రాజులకును మనుష్యులకును వ్యాధిభయములుకలుగును.

---

# రాశిసంచారఫలములు.

—:o:—

(మేషరాశి)

శ్లో॥ అన్యంచాహంప్రవక్ష్యామి గ్రహచారసముచ్చయం ।
కూ్రరేషుసౌమ్యకర్మేషు రాశిరాశిఫలంతదా ॥

తా॥ ఇఁక ముందు మేషాదిరాసులందు గ్రహము లున్నప్పుడు గలుగు ఫలములను జెప్పఁబడునని తా॥

భానుః ॥శ్లో॥ యదాభానుస్థితోమేషే ఫలానితులభాదికం । ఇక్ష్వాది తిలతైలాది తదాచైవమహర్ఘతా ॥

తా॥ రవి మేషమందున్నప్పుడు చెఱకునకుతిల తైల ఫలములకు ధర లధికమగునని తా॥

చంద్రః ॥ అత్రవిశేషః॥శ్లో॥ యదాభౌమో భృగుశ్చైవ శనిక్షేత్రభవివ్యతః । నిశాపతిస్థితస్తత్ర నకించిచ్ఛుభంభవేత్ ॥

తా॥ అంగారక శుక్రులు మకర కుంభములయందున్నప్పుడు చంద్రుఁడచ్చటుండినప్పటికిని శుభమెంతమాత్రమును గలుగనేరదని తా॥

కుజః ॥శ్లో॥ భూమిపుత్రోయదామేషే సుభిక్షంసర్వధాన్యకం । ప్రవాళానిమహార్ఘాణి క్రోధవాంస్తుభవేన్నృపః ॥

తా॥ అంగారకుఁడు మేషమం దున్నప్పుడు సమస్త ధాన్యములు సుభిక్షముగా నుండును. పగడములకు ధర అధికమగును. రాజులకు కోపము కలుగుచుండునని తా॥

బుధః ॥శ్లో॥ బుధోవృశ్చిక మేషేచ మహర్ఘంచచతుష్పదం । సువర్ణం సమతాంయాతి నాత్రకార్యావిచారణా ॥

తా॥ బుధుఁడు వృశ్చికమందుగాని, లేక మేషమందుగాని యుండినప్పుడు సువర్ణమునకు ధర సామాన్యముగా నుండునని తా॥

గురుః ॥శ్లో॥ యదా సురగురుర్మేషే సుఖం సర్వజనేషుచ । సుభిక్షం క్షేమమారోగ్యం సుఖినీమేదినీభవేత్ ॥

తా॥ బృహస్పతి మేషమందున్నప్పుడు సమస్త దేశములయందు సుఖముకలుగునని తా॥

శుక్రః ॥శ్లో॥ యదాదైత్యగురుర్మేషే సర్వధాన్యమహర్ఘతా। మహిషీ
పశుపీడాచ స్వల్పవర్షంఫలంతదా ॥

తా॥ శుక్రుఁడు మేషమందుండఁగా గేదెలు మొదలైన పశువులకు
నష్టముగలుగును. స్వల్పముగా వర్షించునని తా॥

శనిః ॥శ్లో॥ యదాసౌరిర్భవేన్మేషే కాంచనంరూప్యతామ్రకం। మౌక్తి
కంపద్మరాగంచ మహార్ఘంశుభవేత్తదా ॥

తా॥ శని మేషమందుండఁగా బంగారము, వెండి, రాగి, ముత్య
ములు, పద్మరాగములు పీటికి ధరలధికమగునని తా॥

రాహుః ॥శ్లో॥ రాహుశ్చక్రూరసంగేషు యదామేషేభవిష్యతి । దుర్భి
క్షంచభవేత్తత్ర నాత్రకార్యావిచారణా ॥

తా॥ రాహువు క్రూరగ్రహములతోఁగూడి మేషమందుండెనేని
దుర్భిక్షముగలుగునని తా॥

---

(వృషభరాశి)

కుజః ॥శ్లో॥ వృషరాశౌయదాభౌమః సర్వధాన్యమహర్ఘతా। చందనం
కుంకుమంవస్త్రం కార్పాసాదిమహర్ఘతా ॥

తా॥ వృషభమందు అంగారకుఁడుండెనేని సర్వధాన్యములకును,
గంధమునకును, కుంకుమమునకు, వస్త్రములకును, ప్రత్తికిని ధరలధిక
ములగునని తా॥

బుధః ॥శ్లో॥ సోమపుత్రో వృషేస్థిత్వా హ్యేవంకుర్యాచ్చ లక్షణం ।
మేదినీనవఖండేషు కలహశ్చమహద్భయమ్ ॥

తా॥ వృషభమందు బుధుఁడుండినచో (స-గం-కుం-వ-ప్ర) వస్తు
వులకు ధరలధికమగును. మఱియు నవఖండములయందును వైషమ్య
ములుకలిగియుండునని తా॥

గురుః ॥శ్లో॥ యదాజీవోవృషేయాతి సుభిక్షంసర్వసౌఖ్యదం । గోరసా
జ్యంమహార్ఘాణి సస్యంచప్రచురంభవేత్ ॥

తా॥ వృషభమందు గురువున్నప్పుడు సర్వత్ర సుభిక్షంగలుగును.
పాలు నెయ్యి పీటికి ధరలుగలుగును. సస్యసమృద్ధిగలుగునని తా॥

శుక్రః ॥శ్లో॥ యదాశుక్రో వృషేయాతి శ్వేతధాన్యాదిసౌఖ్యదమ్ ॥

తా॥ వృషభమందు శుక్రుఁడుండఁగా శ్వేతధాన్యాదివస్తువులకు ధరలవలన సౌఖ్యముగలుగునని తా॥

శనిః ॥శ్లో॥ వృషే సౌరి ర్యదాయాతి వినశ్యంతి చతుష్పదాః । సప్త ధాన్యంమహర్ఘంచ నృపాణాంవిగ్రహోభవేత్ ॥

తా॥ వృషభమందు శని యున్నప్పుడు పశువులునశించును. సప్త ధాన్యములకు ధరలుగలుగును రాజులకు యుద్ధము సంభవించును.

చం-రా ॥శ్లో॥ వృషేచంద్ర స్తదారాహుః షష్ఠేమాసిచ చాంతకే । దుర్లభానిచధాన్యాని నాత్రకార్యావిచారణా ॥

తా॥ వృషభమందు చంద్ర రాహువులుండిరేని అప్పుడు సర్వవస్తువులు తగ్గియుండునని తా॥

( మి థు న రా శి )

రవిః ॥శ్లో॥ మిథునేభాస్కరోయాతి కార్పాసఃకందమూలకం । తిలాశ్చ సర్వధాన్యంచ మహార్ఘంచభవిష్యతి ॥

తా॥ మిథునమందు సూర్యుఁడుండెనేని ప్రత్తి, కంటమూలములు, నువ్వులు, సమస్తధాన్యములు ధరగలిగియుండునని తా॥

చంద్రః ॥శ్లో॥ మిథునేచైవకన్యాయాం నిశానాథేచసంస్థితే । వర్షాసు తత్రజానీయా ద్వర్ష తేనాత్రసంశయః ॥

తా॥ మిథున కన్యలయందు చంద్రుఁడుండగా భయంకరమైన దుర్భిక్షముగలుగును పశ్చిమ దేశమందు రాజులకు యుద్ధముగలుగును.

అత్రవిశేషః॥ రవి-రా॥శ్లో॥ మిథునేజాయతేభానుః కన్యారాహుస్తథై వచ । ధాన్యానియాంతిసర్వాణి సస్యానిచమహర్ఘతామ్ ॥

తా॥ మిథునమందుసూర్యుఁడును, కన్యయందు రాహువునువున్న యెడల సమస్తధాన్యములకు ధరలధికములగును.

కు-గు-శ-రా ॥శ్లో॥ మిథునేంగారకోజీవ స్తులారాశౌశనైశ్చరః । ధనురాశౌయదారాహు ర్మేఘాశ్చప్రబలాధికాః ॥

తా॥ మిథునమందు అంగారకుఁడును గురువును, తులయందు శని

యును, ధనస్సునందు రాహువును సంచరించునప్పుడు భూమియందు అధికముగా వర్షించునని తా॥

బుధః ॥శ్లో॥ మిథునేచతథాకన్యాం యధాజ్ఞశ్చభవిష్యతి। తదావాయుర్విజానీయా న్మేఘశ్చప్రచురోభవేత్ ॥

తా॥ మిథునమందును కన్యయందును బుధుఁడుండగా గాలితో గూడిన వర్షముగలుగునని తా॥

గురుః ॥శ్లో॥ మిథునేచగురుర్యాతి తత్రాబ్దే దారుణంభయం। నృపాణాంవిగ్రహస్తత్ర స్వల్పంతోయంభవిష్యతి ॥

తా॥ మిథునమందు గురుఁడుండగా ఆసంవత్సరమునందు రాజులకు భయంకరమైన యుద్ధముగలుగును. స్వల్పముగ వర్షించునని తా॥

శనిః ॥శ్లో॥ మిథునేచయదాసౌరి ర్దుర్భిక్షంతత్రరౌరవం। పశ్చిమేదారుణంయుద్ధం నృపాణాంచమహద్భయమ్ ॥

తా॥ మిథునమందు శని యుండగా భయంకరమైన దుర్భిక్షము గలుగును. పశ్చిమదేశమందు రాజులకు యుద్ధముసంభవించునని తా॥

శు-రా ॥శ్లో॥ శుక్రోరాహుస్తథాయుగ్మే శ్వేతధాన్యానియానిచ। ఘృతంచసర్వధాన్యాని సమర్ఘంభవతేతదా ॥

తా॥ మిథునరాశియందు శుక్రరాహువులున్నప్పుడు శ్వేతధాన్యములకు, నెయ్యి, ధాన్యములకు ధరలు సామాన్యముగానుండును.

( క ట క రా శి )

భానుః॥శ్లో॥ కర్కరాశిస్థితోభానుః శ్లేషాయాంతత్రవర్షతి। ధాన్యానితత్రసర్వాణి క్వచిత్క్వాపిమహర్ఘతా ॥

తా॥ కర్కాటకమందు రవియుండఁగా ఆశ్లేషానక్షత్ర దినములందు వర్షము చక్కగాకురియును. ఒకానొకప్పుడు ఒకానొకదేశమందు సర్వధాన్యములకు ధరలధికమగునని తా॥

చంద్రః ॥శ్లో॥ కర్కరాశింగతో క్రూరే యదాభవతి చంద్రమాః। మహర్ఘాణిచధాన్యాని భవంతిచదినద్వయమ్ ॥

తా॥ కటకమందు క్రూరగ్రహములుండి అప్పుడు చంద్రుఁడుండిన మొదల ధరలధికమగునని తా॥

కుజః ॥శ్లో॥ భూమిపుత్రోయదాకర్కే సర్వధాన్యమహర్ఘతా। మహి
షీక్షుమహర్ఘంచ భవతేనాత్రసంశయః ॥

తా॥ కటకమందు అంగారకుఁడుండగా సమస్త ధాన్యములకు, మహిషీ, ఇక్షుదండము వీట్లకు అధిక వెలలుకలుగునని తా॥

బుధః ॥శ్లో॥ నిశాపతేశ్చతనయః కర్కరాశిం యదాభవేత్ । తతోఽతి
సుఖదుఃఖాని సుభిక్షంస్వల్పకారకమ్ ॥

తా॥ కటకమందు బుధుఁడుండెనేని ప్రిజలకు సుఖదుఃఖములు, సుభిక్ష దుర్భిక్షములు సమానములుగా నుండునని తా॥

గురుః ॥శ్లో॥ బృహస్పతిర్యదాకర్కే స్వల్పమేఘః ప్రివర్షతి। రాజభి
ర్విగ్రహశ్చైవ దుర్భిక్షంతత్రజాయతే ॥

తా॥ కటకమందు బృహస్పతి యుండగా భూమియందు స్వల్ప ముగావర్షించును. రాజులు యుద్ధములు చేతురు. ఇదిగాక దుర్భిక్ష ములుగూడ గలుగునని తా॥

బు-శు ॥శ్లో॥ సోమపుత్రోభృగుశ్చైవ చంద్రక్షేత్రే యదాభవేత్ ।
దుర్భిక్షంతత్రజాయంతే షాణ్మాసాం తేనసంశయః ॥

తా॥ కటకమందు బుధ శుక్రులున్నయెడల ఆఱుమాసములపర్యం తము దుర్భిక్షముగానుండునని తా॥

శనిః ॥శ్లో॥ యదాకర్కస్థితసౌరి ర్మధ్యదేశే భవేచ్ఛుభం । నాగ
పూరంవినశ్యేతా అన్యైర్దుర్భిక్షముచ్యతే ॥

తా॥ కటకమందు శనియుండగా మధ్యదేశమందు సుఖముగలు గును. అనూరాధకువచ్చిన నా-నీ-నూ-నే అనుపేర్లుగల దేశములకు మాత్రం నశింపుగాని, దుర్భిక్షముగాని గల్గునని తా॥

రాహుః ॥శ్లో॥ యదా కర్కస్థితో రాహు స్తస్కరాణాం భయం
భవేత్। సమర్ఘంసర్వలోహంచ మహర్ఘంషష్ఠమాసికమ్ ॥

తా॥ రాహువు యెప్పుడు కర్కాటకమందుండునో అప్పుడు దొం గలకు భయముగలుగును. అన్నిలోహములకు ధరలుతగ్గియుండును, ఆఱుమాసములకు తిరిగి పూర్తిధరలు గలిగియుండునని తా॥

( సింహ రాశి )

రవిః ॥శ్లో॥ సింహరాశిగతేభానౌ ఇక్ష్వాదిమిష్టశర్కరా । రక్తాని సర్వభాండాని తిలతైలమహార్ఘతా ॥

తా॥ సింహమందు సూర్యుఁడుండగా చెఱకు మొదలైన తియ్యని పదార్థములకును, రక్తపదార్థములకును, తిలతైలములకును, రత్నములకును ధరలధికమగునని తా॥

కుజః ॥శ్లో॥ యదాసింహగతోభౌమో కాంచనం రుక్మ తామ్రకం । ఆరక్తద్రవ్యసర్వాణి మహర్ఘాణిభవంతిహి ॥

తా॥ సింహమందు అంగారకుఁడుండగా బంగారము, వెండి, రాగి, రక్తద్రవ్యములకు ధరలుగలిగియుండునని తా॥

బుధః ॥శ్లో॥ సింహరాశిం బుధోయస్మి ధాన్యార్ఘంచ సమస్థితం । సూక్తంచ దేవదారుశ్చ మహార్ఘంభవతేతదా ॥

తా॥ సింహమందు బుధుఁడుండగా ధాన్యమునకుమాత్రం ధరలు తగ్గును. అంగడి వస్తువులకును, దేవదారు ద్రావకమునకును ధర హెచ్చునని తా॥

గురుః ॥శ్లో॥ యదాసింహేగురుశ్చైవ సుభిక్షంతత్రజాయతే। మేఘాశ్చ ప్రబలాస్తత్ర బహుసస్యాచమేదినీ ॥

తా॥ సింహమందు బృహస్పతియుండగా సుభిక్షము గలుగును. వర్షమధికముగా కురిసియును పంటలధికముగానుండును.

శుక్రః॥శ్లో॥ యదాదైత్యగురుస్సింహే హేమరక్తచతుష్పదం।ధాన్యానిచమహర్ఘాణి యదిచైవదినానిచ ॥

తా॥ సింహమందు శుక్రుఁడు సంచరించునప్పుడు బంగారము, రక్తద్రవ్యములు, ధాన్యాదులు, ధేనువులకును దినక్రమముగా ధరలు గలిగియుండునని తా॥

శనిః॥శ్లో॥ సింహరాశిగతస్సౌరి స్సమభావోభవిష్యతి । గుడ తైలం మహర్ఘంచ మాలవోపింవినస్యతి ॥

తా॥ సింహమందు శనియుండఁగా ధాన్యములకు ధరలు తగ్గును.

బెల్లము, తైలము వీనికి ధర గలిగియుండును. మాళవ దేశమునకుపీడా నష్టముగునని తా॥

రాహు॥ శ్లో॥ యదాసింహగతేరాహూ శృంగవేరకటుత్రయం। షష్ఠే మాసివ్యతీతేచ లాభశ్చైవచతుర్గుణః ॥

తా॥ సింహమందు రాహువున్నప్పుడు అల్లము, శొంఠి, మిరియాలు, పిప్పళ్లు యీవస్తువులకు నాలుగుమాసములకు నిమ్మట ధరలధికములగునని తా॥

## (కన్యారాశి)

రవిః ॥శ్లో॥ కన్యారాశిగతేభానౌ మంజిష్ఠాదిమహార్ఘతా। నారికేళతిలం తైలం సర్వస్యచమహార్ఘతా ॥

తా॥ సూర్యుఁడు కన్యారాశినిపొందినప్పుడు నారికేళ,తిల,తైల, మంజిష్ఠాదులకు ధర హెచ్చగునని తా॥

చంద్రః ॥శ్లో॥ కన్యారాశిగతే చంద్రే లోధ్రి మాంజిష్ఠ రాజికం। మహార్ఘంషడ్దినాంతేచ హ్యేతద్భావమహార్ఘతా ॥

తా॥ చంద్రుఁడు కన్యయందు దున్నప్పుడు ఆరు దినములకు పైన లోధ్రి (లొద్దుగరసము) మంజిష్ఠాదిరసములకు ధర హెచ్చునని తా॥

కుజః॥ శ్లో॥ కన్యరాశింగతేభౌమే చందనం పట్టవస్త్రకం। ఆరక్తాదర్ధ వస్త్రాణాం ప్రథమేత్తుమహార్ఘతా॥

తా॥ కుజుఁడు కన్యయందుండఁగా గంధమునకును, పట్టువస్త్రములకును, యెఱ్ఱబట్టలకును ధర హెచ్చును.

బుధః శ్లో॥ కన్యరాశింగతేజ్ఞేహి కాంచనం శుద్ధశర్కరా। మాసే షష్ఠేభవేల్లాభం పునఃశస్త్రోభిజాయతే॥

తా॥ బుధుఁడు కన్యయందుండగా ఆఱుమాసములకుపైన బంగారము, పటిక బెల్లములకు ధర హెచ్చును.

గురుః॥ శ్లో॥ కన్యారాశిగతేజీవే మేఘవృష్టిస్తథోత్తమా। సుభిక్షం సర్వధాన్యానా మారోగ్యంలభతేజనః ॥

తా॥ గురువు కన్యయందుండగా చక్కఁగా వర్షము కురిసియుండును

సమస్త ధాన్యములు సమృద్ధిగా నుండును. ఆరోగ్యముగూడ గలిగి-యుండునని తా॥

శుక్ర॥శ్లో॥ కన్యారాశిగతేశుక్రే సర్వసస్యం వినశ్యతి। తత్రధాన్య మహర్ఘాణి శాలిశ్చైవవిశేషతః॥

తా॥ శుక్రుఁడు కన్యయందుండగా సస్యములునశించును ధాన్యముకు ధర హెచ్చునని తా॥

శని॥శ్లో॥ యదాభాస్కరతనయః కన్యారాశింప్రవిశ్యతి। జలశోషం భవేద్వాయు ర్మధ్యదేశేనృపక్షయమ్॥

తా॥ శని కన్యయందుండగా జలాభావమగును. గాలిహెచ్చును మధ్యదేశమందు రాజక్షయముకలుగును.

రా-కే॥శ్లో॥ రాహుకేతూ యదాకన్యాం ధాత్రీఫలంచపిప్పలీ। మాసమేకంద్వయంచైవ మహర్ఘంత్రిగుణంభవేత్॥

తా॥ రాహుకేతువులు కన్యయందుండిరేని ధాత్రీఫలం అనఁగా ఉసిరికాయలు, పిప్పలి వీటికి ఒక మాసముసకు ధర హెచ్చును. మూఁడుమాసములకు మూఁడురెట్లు పెరుగుచుండునని తా॥

( తు లా రా శి )

రవిః॥శ్లో॥ తులారాశింయదాభాను ర్గతదేవంమహర్ఘతా।ధాన్యానాం హేమద్రవ్యాణాం కుంజరాణాంవినాశతా॥

తా॥ రవి తులయం దుండఁగా ధాన్యమునకు, బంగారమునకు, యేనుఁగులకు నాశముగలుగునని తా॥

కుజః॥శ్లో॥ భూమిపుత్రిస్తులేజాతః సర్వధాన్యమహర్ఘతా। మాషా ముద్గాస్తథాసూత్రం కార్పాసాదివిశేషతః॥

తా॥ అంగారకుఁడు తులయందుండగా మినుములు, పెసలు, పాదరసము, దూది వీటికి ధర హెచ్చును.

బుధః॥శ్లో॥ యదాచ తులరాశిస్థో నిశాకరసుతస్థితః। మేఘశ్చ భవతేతత్ర మేదినీకలహాన్వితా॥

తా॥ బుధుఁడు తులయందుండఁగా వర్ష మధికముగ కుఱియును. భూమియందంతటను కలహముసంభవించును

గురుః ॥శ్లో॥ తులారాశింగురుర్గత్వా జ్వరవ్యాధింవినిర్దిశేత్ । సుభిక్షం
తత్రిజ్ఞాతవ్యం క్వచిత్క్వాపిమహార్ఘతా ॥

తా॥ గురువు తులయందుండెనేని ప్రజలకు జ్వరబాధ లధికముల గును. కొంతసుభిక్షము గలుగును. కొన్ని దేశములందు ధరలుహెచ్చు నని తా॥

శుక్రః ॥శ్లో॥ యదా దైత్యగురుశ్చైవ తులారాశిం ప్రవర్తతే । మేది
న్యాంక్షేమమారోగ్యం కించిత్కించిద్విరోధకృత్ ॥

తా॥ శుక్రుడు తులయందుండగా భూమియందంతట ఆరోగ్యము గలుగును కొన్నిదేశములందు కలహములుగలుగునని తా॥

శనిః ॥శ్లో॥సూర్యపుత్రేతులేజాతే హ్యగ్న్యుపద్రవమాదిశేత్ । సప్త
ధాన్యమహార్ఘాణి మేదినీనష్టకారకా ॥

తా॥ శని తులయందుండగా అగ్నిభయము సంభవించును. సప్త విధ ధాన్యములకు ధరలు హెచ్చును భూమియందున్న ప్రజలకు నాశ ముగలుగునని తా॥

రాహుః ॥శ్లో॥యదారాహుస్తులేయాతి క్రూరఃక్రూరసమన్వితః । మేది
న్యాంసస్యనాశస్స్యాద్దుర్భిక్షంతత్రదారుణమ్ ॥

తా॥ రాహువు ఒంటరిగా తులారాశియందుండినగాని, లేకక్రూర గ్రహముతో గూడియుండుటగాని సంభవించినప్పుడు సస్యములు నశిం చుట, అందువలన దుర్భిక్షములు గలిగియుండునని తా॥

( వృశ్చికరాశి )

రవిః ॥శ్లో॥ యదార్కోవృశ్చికేయాతి తదార్ఘంసమజాయతే। ఊర్ణకం
సర్వద్రవ్యాణి స్వల్పార్ఘంచప్రదీయతే ॥

తా॥ సూర్యుడు వృశ్చికమందుండగా పట్టుబట్టలకు ధరహెచ్చును సమస్తద్రవ్యములకు ధరతగ్గును.

కుజః ॥శ్లో॥ యదావృశ్చికరాశిస్థో జాయతేచ మహీసుతః । మహార్ఘం
సర్వద్రవ్యాణాం నృపాణాంకోపమాదిశేత్ ॥

తా॥ అంగారకుడు వృశ్చికమందుండగా సమస్తధాన్యములకు ధర హెచ్చును. రాజులకు కోపముగలుగును.

గురుః ॥శ్లో॥ వృశ్చికేచగురుర్యాతో దుర్భిక్షం తత్రజాయతే। స్వల్ప వృష్టిర్భవేత్తత్ర భూర్యతానరకిల్బిషైః ॥

తా॥ బృహస్పతి వృశ్చికమందుండగా వర్షము స్వల్పముగా గురి యును. దుర్భిక్షముగలుగును పాపము లధికములగును

శుక్రః ॥శ్లో॥ వృశ్చికేచగతే శుక్రే సర్వధాన్య మహార్ఘతా॥ లోకస్తు నిర్భయస్తత్ర సుఖస్వస్థం ప్రవర్తతే ॥

తా॥ శుక్రుఁడు వృశ్చికమందుండగా సమస్తధాన్యములకు ధరలు హెచ్చును. దేశమందు సుభిక్షముగలిగియుండునని తా॥

శనిః ॥శ్లో॥ యదావృశ్చికగస్సౌరి మేదినీదుఃఖసంయుతా । వర్షమాత్ర మథాచోర్ధ్వ మింద్రప్రస్థోవినశ్యతి ॥

తా॥ శని వృశ్చికమందుండగా దుఃఖమధికమగును. సంవత్సర ముకుపైన ఇంద్రప్రస్థము అనగా ఢిల్లీనగరమందు చెరుపు కలిగియుండు నని తా॥

రాహుః ॥శ్లో॥ యదావృశ్చికరాశిస్థః సంహికేయోపిజాయతే । మనో ద్దిష్టఫలంచాపి షష్ఠేమాసేచరౌరవమ్ ॥

తా॥ రాహువు వృశ్చికమందుండగా ఇష్టార్థసిద్ధియగును. ఆరు మాసములకు పైన హాహాకారము గలుగును. అనఁగా దోషముగా నుండునని తా॥

( ధనూరాశి )

రవిః ॥శ్లో॥ ధనూరాశిగతోభానుః సుభిక్షం తత్రజాయతే । తిలతైలం మహార్ఘంచ కార్పాసాదితథైవచ ॥

తా॥ సూర్యుఁడు ధనుస్సునందు ప్రవేశించినప్పుడు సర్వత్ర సుభి క్షముకలుగును. తిల తైలములు ప్రత్తివగైరాలకు ధర హెచ్చును.

చంద్రః ॥శ్లో॥ యదానిశాకరశ్చైవ మీనేయాతితథాధనే॥ ధ్రువంవా తద్దినేవృష్టి ర్భవిష్యతిచనాన్యథా ॥

తా॥ చంద్రుఁడు ధనరాశియందుగాని, లేక మీనరాశియందు గాని వున్నప్పుడు భూమియందు తప్పక వర్షించునని తా॥

కుజః ॥శ్లో॥ ధనురాశిగతే భౌమే మూలద్రవ్య తృణానిచ। కాష్ఠంచ
ఘృతకార్పాసం మహార్ఘచచతుష్పదామ్ ॥

తా॥ అంగారకుఁడు ధనస్సునందుండగా మూలద్రవ్యములకు, కట్టెలకు, ఘృతమునకు, ప్రత్తికి ధర హెచ్చును.

బుధః ॥శ్లో॥ ధనే మీనే బుధోయాతి మారయంతి మృగాన్గజాన్ ।
రాజావిరోధకృత్తత్ర చాన్యథానభవిష్యతి ॥

తా॥ బుధుఁడు ధనుర్మీనములందుండగా యేనుఁగులకు, మృగములకు నాశముగలుగును. రాజులకు కోపముగలుగుచుండును.

గురుః ॥శ్లో॥ ధనూరాశిస్థితో జీవో గోధూమాది మహర్ఘతా । వర్షాకాలేభవేత్సస్యం మహర్ఘంతైలమైరవమ్ ॥

తా॥ బృహస్పతి ధనస్సునందుండగా గోధుమలకు ధర హెచ్చును. వర్షాకాలమందు పైరులు బాగుండును. నూనె, కల్లు, సారాయిద్రవ్యములకు ధర హెచ్చును.

శుక్రః ॥శ్లో॥ యదాచధనురాశిస్థో దైత్యగురుఃప్రవర్తతే। మహార్ఘంచ
విజానీయా త్సర్వసస్యంవినశ్యతి ॥

తా॥ శుక్రుఁడు ధనస్సునందుండగా అన్నిటికీ ధర హెచ్చును. సర్వసస్యములు తగ్గియుండును.

శనిః ॥శ్లో॥ ధనూరాశౌస్థితౌసౌరి ర్గర్జితోపినవర్షతి । తోయహీనాధరా
తత్ర దుర్భిక్షంచవినిర్దిశేత్ ॥

తా॥ శని ధనస్సునందున్నప్పుడు మేఘములు వచ్చియున్నప్పటికి వర్షాభావమగును. కరువుకూడా కలిగియుండును.

రాహుః ॥శ్లో॥ ధనూరాశిస్థితో రాహుః పంచమాసాధికం భవేత్ ।
మహర్ఘంచధ్రువంయాతి కుంజరాణాంహయానిచ ॥

తా॥ రాహువు ధనస్సునందుండగా ఐదుమాసములకుపైన గజములకు, అశ్వములకు ధరలు హెచ్చును.

( మ క ర రా శి )

రవిః ॥శ్లో॥ మకరేచస్థితేభానౌ ఘృతతైలమహర్ఘతా। సుభిక్షంతత్ర
ధాన్యానాం లోకానాంశుభదంభవేత్ ॥

తా॥ రవి మకరరాశియందుండగా ఘృతమునకు, నూనెకు ధర హెచ్చును. సర్వత్రా సుభిక్షముగానుండును.

కుజః ॥శ్లో॥ మకరేచస్థితేభౌమే ఘృతతైలమహార్ఘతా। సుభిక్షంసర్వ
ధాన్యానాం లోకానాందుఃఖపీడనమ్ ॥

తా॥ అంగారకుఁడు మకరమందుండగా ఘృతమునకు, నూనెకు ధర హెచ్చును. సర్వధాన్యములు సుభిక్షముగా నుండును. ప్రజలకు మనోదుఃఖము లధికములగును.

బుధః ॥శ్లో॥ నిశాపతేశ్చతనయః శనిక్షేత్రేయదాభవేత్। సమభావ
సుఖందుఃఖం తథైవచశుభాశుభమ్ ॥

తా॥ బుధుఁడు మకరమందుండగా సుఖ దుఃఖములు సమానముగా నుండునని తా॥

గురుః ॥శ్లో॥ మకరేచగురుశ్చైవ దుర్భిక్షంఘోరదారుణం। రాజ్ఞాం
పరస్పరంయుద్ధం త్రిమాసాంతేశుభంభవేత్ ॥

తా॥ బృహస్పతి మకరమందుండగా దుర్భిక్షము గలుగును. ప్రజలకు భయము వృద్ధినొందును. రాజులకు యుద్ధముసంప్రాప్తమగును. మూఁడుమాసములకుపైన క్షేమముగలుగును.

శుక్రః ॥శ్లో॥ మకరేతుయదాశుక్రః సర్వసస్య వినాశకృత్। జాయ
తేఽత్రసమర్ఘాణీ నాత్రకార్యావిచారణా ॥

తా॥ శుక్రుఁడు మకరమందుండగా సమస్తసస్యములు నశించును. ధరలు సామాన్యముగానుండునని తా॥

శనిః ॥శ్లో॥ మకరేచ యదాసౌరిః దుర్భిక్షం తత్రదారుణం। కామా
ర్తాశ్చవినశ్యంతి హ్యన్యదేశేభంభవేత్ ॥

తా॥ శని మకరమందుండగా భయంకరమైన దుర్భిక్షముగల్గును, కోరికలుగలవారు నశింతురు అన్యదేశమందు మాత్రము క్షేమము గలుగునని తా॥

రాహుః ॥శ్లో॥ మకరేచయదారాహుః కాంస్యసూత్రస్యసంగ్రహః।
మాసేతృతీయేఽతీతేతు లాభశ్చైవచతుర్గుణః ॥

తా॥ రాహువు మకరమందుండగా కంచు, పాదరసము వీనిని

సంగ్రహించవలెను. అనఁగా దాచిపెట్టవలెననుట. పిమ్మట మూఁడు మాసములకుపైన విక్రయించిన లాభముగలుగును

## ( కుంభరాశి )

రవిః ॥శ్లో॥ కుంభరాశౌయదాభానుః సమృద్ధిస్సముజాయతే । లవణంచ
తథాతైలం స్వల్పార్ఘంతత్రదాపయేత్ ॥

తా॥ రవి కుంభమందుండగా సర్వసమృద్ధి గలుగును. లవణముకును, నూనెకును అప్పుడు ధర హెచ్చును.

కుజః ॥శ్లో॥ భూసుతఃకుంభరాశిస్థ స్సర్వధాన్యమహార్ఘతా । ఏవంప్రజా
యతే హ్యర్ఘం లోకమధ్యేతునిర్భయమ్ ॥

తా॥ అంగారకుఁడు కుంభమందుండగా ధాన్యములకు ధరలు హెచ్చును. భయములేకనే ప్రజలు సంచరించుతురు.

బు-గు॥శ్లో॥ కుంభరాశిబుధేజీవే మేఘః స్వల్పాంబువర్షతి । కృషి
నాశంచదుర్భిక్షం పూర్వదేశేమహార్ఘతా ॥

తా॥ బుధబృహస్పతులు కుంభమందుండగా స్వల్పవర్షము కురియును. పైరులు నశించును. తూర్పుదేశమందు ధర హెచ్చును.

శుక్రః ॥శ్లో॥ ఘటమీనగతేశుక్రే దుర్భిక్షంప్రచురంభవేత్ । మేదినీ
సుఖసంయుక్తా భవతేనాత్రసంశయః ॥

తా॥ శుక్రుఁడు కుంభ మీనములందు ప్రవేశించినప్పుడు దుర్భిక్షము అనఁగా కరువు సంప్రాప్తించును. భూమియందుమాత్రము సుఖముగలుగును.

శనిః ॥శ్లో॥ కుంభరాశిగతస్సౌరి ర్వర్షమాత్రం తదర్ధకం । కాళింద్యా
ఉపకంఠేచ తత్రధాన్యమహర్ఘతా ॥

తా॥ శని కుంభమందుండగా ఒకసంవత్సరముకుగాని, ఆఱుమాసములకుగాని యమునాతీరమందు ధర హెచ్చుచుండునని తా॥

రాహుః ॥శ్లో॥యదారాహుస్థ్సితే కుంభే క్రూరగ్రహసమన్వితః । గృహీ
తేసూత్రగోధూమే మాసేషష్ఠేచతుర్గుణమ్ ॥

తా॥ రాహువు క్రూరగ్రహయుతుఁడై కుంభమందుండెనేని గోధుమలు, రసము వీట్లకు ఆఱుమాసములకుపిమ్మట ధర హెచ్చునని తా॥

## ( మీ న రా శి )

రవిః ॥శ్లో॥ మీనరాశిగ తేభానౌ సర్వధాన్యమహర్ఘతా । లవణం తిల
 తైలంచ మహర్ఘంసమజాయతే ॥

తా॥ సూర్యుఁడు మీనరాశియందుండగా ఉప్పు, తైలము, ధాన్యము వీనికి ధర హెచ్చుననని తా॥

కుజః ॥శ్లో॥ మీనరాశింకుజశ్చైవ తృణకాష్ఠంచతుష్పదం । మహర్ఘం
 జాయతేసర్వం గృహ్యాతేతత్రిపండితైః ॥

తా॥ అంగారకుఁడు మీనమందుండగా కట్టెలకు, గడ్డికి, పశువులకును ధర హెచ్చుచుండుననని తా॥

బు-గు-శు॥శ్లో॥ బుధస్సురగురుర్మీనే దుర్భిక్షంపూర్వదేశకే । శుక్రశ్చ
 జాయతేక్షేమం సుభిక్షంచతథాభవేత్ ॥

తా॥ బుధ బృహస్పతులు మీనమందుండగా తూర్పుదేశమందు దుర్భిక్షముగలుగును. శుక్రసంచారమువలన వెంటనే సుభిక్షముగూడ కలుగుననని తా॥

శనిః ॥శ్లో॥ అర్కపుత్రోయదామీనే దుర్భిక్షంతత్రిరౌరవం । సాగరా
 స్సర్వనద్యాది వినశ్యంతిచతుష్పదాః ॥

తా॥ శని మీనరాశియందుండగా ప్రజలకు భయంకరమైన వస్తుధరలుగలిగియుండును. పశువులకు కొంత నష్టమున్ను, జీవనములైన నదులందును, సముద్రమందును సంచరించువారికి కొంతనష్టంగల్గును.

రాహుః ॥శ్లో॥మీనరాశిగతేరాహౌ సర్వధాన్యస్య సంగ్రహః । వర్ష
 మాత్రంచదుర్భిక్షం పశ్చాత్సుభిక్షమేవచ ॥

తా॥ రాహువు మీనమందుండఁగా ధాన్యములను సంపాదించవలెను. ఒక సంవత్సరముకుపైన సుభిక్షంగలుగును.

## గ్రహ మిశ్ర ఫలా ఫలములు.

శ్లో॥ అన్యచ్చాహంప్రవక్ష్యామి గ్రహ మిశ్రిఫలాఫలం ।
దుర్భిక్షంజాయతేయేన సుభిక్షంవా తథైవచ ॥
యోగాశ్శుభకరాస్సంతి యేచనిగ్రహకారకాః ।
వ్యాధిదుఃఖకరాంశ్చైవ తాన్ యోగాన్ప్రవదామ్యహమ్॥

తా॥ శుభప్రదములును, శుభకారకములును, వ్యాధికారణము లును అయిన యోగములు జెప్పఁబడును.

శ్లో॥ రవిరాహుకుజాశ్చైవ చంద్రశుక్రశనైశ్చరాః ।
ఏకరాశింయదాస్థిత్వా పూర్వదేశేవినాశకాః ॥

తా॥ రవి-రాహు-కుజ-చంద్ర-శుక్ర-శనులు ఏకరాశిగతులై రేని పూర్వదేశమునందు కొంత మార్పుగలిగి నష్టముకలుగునని తా॥

శ్లో॥ భూపాలాస్త్రతపీడ్యంతే మృత్యుస్తేషాంభవేద్ధ్రువం ।
మార్గోనగమ్యతేలోకై ర్భయభీతాచమేదినీ ॥

తా॥ పై యోగమందు రాజులకు మృత్యువుగలుగును. ప్రజలకు భయమును, మార్గములు దేశములు సరిగానుండవని తా॥

శ్లో॥ రవిరంగారకోరాహు శ్చంద్రజోపిశనైశ్చరః ।
ఏకరాశౌయదాస్థిత్వా దక్షిణాత్యక్షయోభవేత్ ॥

తా॥ రవి-కుజ-రాహు-చంద్ర-శనులు ఏకరాశిగతులైరేని దక్షిణ దేశమునందు కొంత నష్టముగలుగును.

శ్లో॥ కుజార్కశ్చశనీరాహుః శశాంకోనిర్జరోగురుః ।
ఏకరాశింయదాస్థిత్వా తదాదుర్భిక్షకారకాః ॥

తా॥ రవి-కుజ- రాహు-చంద్ర- గురు-శనులు ఏకరాశిగతులైరేని దుర్భిక్షము సంభవించునని తా॥

శ్లో॥ తదాచరాజ్యభంగస్స్యా త్తోగ్రధయుక్తాచమేదినీ ।
కురుతేఛ్ఛత్రభంగంచ నాత్రకార్యావిచారణా ॥

తా॥ పై యోగమందు రాజ్యభంగముగలుగును. ప్రజలకు క్రోధము వృద్ధియగును. ఛత్రభంగము గలుగును.

శ్లో॥ ఆదిత్యగురుశుక్రాశ్చ భూమిపుత్రస్తథైవచ ।
ఏకత్రయదితిష్ఠంతి సర్వధాన్యమహార్ఘతా ॥

తా॥ రవి-గురు-శుక్ర-కుజులు ఏకరాశిగతులైరేని సర్వధాన్యము లకు ధర హెచ్చునని తా॥

శ్లో॥ కుజార్కేందుబుధాజీవ స్సింహరాశిస్థితాయది ।
రాజ్యభంగంప్రజాకష్టం ఛత్రభంగంభవేద్ధ్రువమ్ ॥

తా॥ కుజ-రవి-చంద్రి-బుధ-బృహస్పతులు సింహమం దుండిరేని రాజ్యభంగము, ఛత్రిభంగము, అతికష్టములు సంప్రాప్తమగునని తా॥

శ్లో॥ ఆదిత్యబుధశుక్రాశ్చ హ్యేకరాశింత్రియోయది ।
యానికానిచధాన్యాని సర్వంసామ్యంస్మృతంబుధైః ॥

తా॥ రవి-బుధ-శుక్రిలు ఏకరాశిగతులైరేని సర్వధాన్యములకు ధర సమానముగా నుండునని తా॥

శ్లో॥ ఆదిత్యగురుశుక్రాశ్చ హ్యేకనక్షత్రసంయుతాః ।
వాయోరుపద్రవస్తత్రి హ్యగ్న్యుద్వేగస్తథైవచ ॥

తా॥ రవి- గురు- శుక్రిలు ఏకనక్షత్రగతులైరేని గాలివలనను, అగ్నివలనను భయములుగలుగును.

శ్లో॥ ఆదిత్యోభార్గవశ్చైవ తృతీయోగురురేవచ ।
ఏకరాశించతిష్ఠంతి మేఘాశ్చప్రిబలాధికాః ॥

తా॥ రవి- శుక్ర- గురువులు ఏకరాశిగతులైరేని అధికవర్షములు కురియునని తాత్పర్యము.

శ్లో॥ ఆదిత్యోభూసుతశ్శుక్రో హ్యేకనక్షత్రరాశిగాః ।
ఘృతంతైలంమసూరాన్నం మహార్ఘ్యం దేశవిగ్రిహాః ॥

తా॥ రవి-కుజ-శుక్రులు ఏకనక్షత్రిగతులైరేని నెయ్యి, నూనె, చిరిశనగలు ధరగలిగియుండును. కలహములుగూడ గలుగ్గును.

శ్లో॥ ఆదిత్యగురుశుక్రాశ్చ సంహికేయశనైశ్చరా ।
ఏకరాశింయదాస్థిత్వా సుభిక్షంమేఘపుష్కలమ్ ॥

తా॥ రవి- గురు- శుక్రులు- రాహు- శనులు ఏకరాశిగతులైరేని చక్కగా వర్షించును. సుభిక్షముగలుగును.

శ్లో॥ ఆదిత్యబుధజీవాశ్చ రాహుశ్చార్కసుత స్థితః ।
ఏకరాశింయదాస్థిత్వా సుభిక్షం మేఘపుష్కలమ్ ॥

తా॥ రవి-బుధ- గురు- రాహు- శనులు ఏకరాశిగతులైనప్పుడును సుభిక్షముగలుగును.

శ్లో॥ భూమిపుత్రోయదాసౌరిః శుక్రోసినిర్జరోగురుః ।
ఏకత్రయదిదృశ్యంతే నృపాణాంక్షయమ్మాదిశేత్ ॥

తా॥ కుజ- శని- శుక్ర- గురువులు ఏకరాశిగతులై రేని రాజులకు కష్టప్రదముగా నుండును.

శ్లో॥ శుక్రశ్చాంగారకస్సౌరి శ్చైకత్రయదిదృశ్యతే।
దుర్భిక్షంజాయతేతత్ర హ్యగ్నిదాహోభవేద్ధ్రువమ్ ॥

తా॥ శుక్ర-కుజ-శనులు ఏకరాశిగతులైరేని దుర్భిక్షము, అగ్ని భయము కలుగునని తా॥

మూ॥ శనిశుక్రజీవజ్ఞధరాసుతాశ్చ యద్యేకరాశౌగ్రహపంచకం స్యాత్ । జలం నమేఘే కృషి సర్వనష్టా తస్మిన్వర్షే కుంకుమాదేర్మహార్ఘమ్ ॥

తా॥ శని-శుక్ర-గురు-బుధ-కుజులు ఏకరాశిగతులైరేని మేఘము వర్షాభావమగును. చేసినవ్యవసాయము నిష్ఫలమగును. కుంకుమాదులకుమాత్రము ధర హెచ్చును.

మూ॥ గుర్వశుక్ర సౌరీ బుధసంహికేయో గ్రహపంచకంస్యా ద్యది చైకరాశౌ । నృదేశపీడా దుర్భిక్షంధరణ్యాం స్వర్ణాదిధాత్వష్ట మహర్ఘతాచ ॥

తా॥ గురు- శుక్ర- శని- బుధ- రాహువులు ఏకరాశిగతులైరేని మనుష్యులకు పీడ, దుర్భిక్షమును, బంగారముమొదలైన అష్టధాతువులకు ధర హెచ్చునని తా॥

మూ॥ రవీందుజీవాయదిచైకఋక్షే జనదేశపీడాదిసముద్భవేచ। యవధాన్యముద్గక్రయదివ్యవస్త్రం బహులంచలాభంగతసప్తమాసే ॥

తా॥ రవి-చంద్ర-గురువులు ఏకనక్షత్రగతులైరేని మనుష్యులకు పీడగలుగును. యవధాన్యము, పెసలు, వస్త్రములు వీట్లకు యేడు మాసములపిమ్మట లాభముగలదని తా॥

మూ॥ రవిశ్చాంద్రిరిందు ర్గురుర్భార్గవశ్చ యద్యేకరాశౌ స్థితయేవ పంచ । ఘనాగర్జమానా స్సజలాచవృష్టి స్తదామహార్ఘందిశి నైఋతేచ ॥

తా॥ రవి-బుధ-చంద్ర-గురు-శుక్రులు ఏకరాశిగతులైరేని మేఘములు చక్కగా వర్షించును. నైఋతిదిక్కునందు ధరలుహెచ్చును.

శ్లో॥ జీవార్క-శుక్రారవినందనోవా పృథ్వీసుతోవాయదిచైక
భూపాలకష్టంజనదేశపీడా ధాన్యానిసర్వాణిమహార్ఘతా

తా॥ గురు-రవి-శుక్ర-శని-కుజులు ఏకరాశిగతులైరేని రా
ప్రజలకు కష్టములుగలుగును. ధాన్యములకు ధర హెచ్చునని తా

శ్లో॥ యత్రరాశౌరవిస్థిత్వా తత్రశుక్రోయదాస్థితః ।
వాతశ్చభవతేదీర్ఘ స్సర్వంహ్యర్ఘంసమస్థితమ్ ॥

తా॥ రవి-శుక్రులు ఏకరాశిగతులైరేని వాతపీడ గలుగును
హెచ్చునని తా॥

మూ॥ శనిరాహుజీవౌయదిచైకరాశౌ పాషాణవృష్టిసహితా
వృష్టిః । దుఃఖంచసైన్యేషునృపాద్భయంచ ధాన్యాని
సుభిక్షతాని ॥

తా॥ శని- రాహు- గురువులు ఏకరాశిగతులైరేని రాళ్ళ
కుఱియును. పరరాజులవలన భయము గలుగును. ధాన్య
చక్కగా ఫలించునని తా॥

శ్లో॥ అమావాస్యాంతులేచంద్రే మకరేచేత్తుమంగలః ।
వినాచక్రంభవేచ్చూర్ణం వాణిజ్యంనిష్ఫలంభవేత్ ॥

తా॥ అమావాస్యనాడు చంద్రుఁడు తులయందున్ను, అంగా
మకరమందును యుండిరేని అస్త్రములులేకనే మనుష్యులు నశిం
వర్తకము నిష్ఫలమగును.

శ్లో॥ సురేజ్యశుక్రౌక్షితినందనోవా యద్యేకఋక్షేప్యథవైక
సుభిక్షమన్నంనృభిరత్రగ్రాహ్యం మాసేచతుర్థే బహులశ్చల

తా॥ గురు-శుక్ర-కుజులు ఏకనక్షత్రమందుగాని, ఏకరాశియ
గాని వుండిరేని సుభిక్షముగలుగును. ధాన్యములు ఖరీదుచేయవ
నాలుగుమాసములకు లాభము కలుగగలదని తా॥

శ్లో॥ ఆదిత్యోగచ్ఛతిహ్యగ్రే పృష్ఠేభవతిభార్గవః ।
మధ్యేసోమసుతస్థిత్వా దుర్భిక్షంతత్రజాయతే ॥

తా॥ ముందు సూర్యుఁడు, వెనుక శుక్రుఁడు, మధ్యయందుబు
ధుఁను సంచరించుచున్నయెడల దుర్భిక్షముగలుగునని తా॥

శ్లో॥ ఏకత్రశనిశుక్రౌచ పృష్ఠేచంద్రసుతోభవేత్।
సుభిక్షంభవతేతత్ర ధాన్యేనపూరితామహీ ॥

తా॥ ముంధు శని శుక్రులు, వెనుక బుధుఁడు నున్నయెడల సుభిక్షముగలుగును. ధాన్యసమృద్ధి గలిగియుండునని తా॥

శ్లో॥ మేషేచభవతేభాను ర్వృషేభూమిసుతస్థ్సితః ।
నృపతేశ్చభవేద్వ్యాధి ర్లోకానాంచమహద్భయమ్ ॥

తా॥ మేషమందు రవి, వృషభమందు అంగారకుఁడును సంచరించినచో రాజునకు రుగ్మతయును, మనుష్యులకు భయములును గలుగునని తాత్పర్యము.

శ్లో॥ భార్గవోభౌమసౌరీచ వృషేస్థిత్వాత్రయోయది ।
దుర్భిక్షంరాజ్యభంగశ్చ మేదిన్యామగ్నితోభయమ్ ॥

తా॥ శుక్ర-కుజ-శనులు వృషభమం దున్నయెడల దుర్భిక్షము, రాజ్యభంగము, అగ్నిభయము గలుగునని తా॥

శ్లో॥ మేషే శనైశ్చరోభానుః భార్గవోభూసుతస్తదా।
ఏకార్ణవోమహాం పృథ్వ్యాం దుర్భిక్షంతత్రజాయతే ॥

తా॥ మేషమందు శని- రవి- శుక్ర- కుజు లున్నయెడల ఏకార్ణవముగానుండును. అనఁగా సర్వత్రా జలమయమై యుండును. దుర్భిక్షముగూడ గలిగియుండునని తా॥

శ్లో॥ మంగలోరాహుశుక్రౌచ స్థిత్వాయదిత్రయస్తులే।
పరస్పరంనృపైర్యుద్ధం రుధిరైఃపూరితామహీ ॥

తా॥ కుజ-రాహు-శుక్రులు తులయందుండిరేని రాజులకు యుద్ధములుగలుగును. భూమి రక్తపూరితమగునని తా॥

శ్లో॥ మీనరాశిగతస్సౌరిః కర్కరాశౌగురుర్భవేత్ ।
తులారాశౌభవేద్భౌమో దుర్భిక్షంతత్రజాయతే ॥

తా॥ మీనమందు శనియును, కటకమందు బృహస్పతియును, తులయందంగారకుఁడు నుండిరేని అప్పుడు దుర్భిక్షముగనుండునని తా॥

శ్లో॥ క్షితిజోభార్గవేందూచ మీనరాశిస్థితాయది ।
సమర్ఘగోవృషాదీనాం స్వల్పవృష్టిఃప్రజాయతే ॥

తా॥ కుజ-శుక్ర-చంద్రులు మీనమందుండిరేని గోవులకు, ఎద్దులకు ధర తగ్గియుండును. వర్షము స్వల్పముగా కురియునని తా॥

## తిథి వార మాస గుణములు.

శ్లో॥ అన్యానహంప్రవక్ష్యామి తిథివారేచయేగుణాః ।
మాసేమాసేచయైర్యోగై ర్నిత్యంచదీయతేఫలమ్ ॥

తా॥ ఇదిగాక తిథి వారములందలి గుణములనున్ను, ప్రతిమాసమం దిచ్చు యోగఫలములను జెప్పఁబడును. అనఁగా మాస తిథి వార యోగ ఫలములు జెప్పఁబడునని తా॥

శ్లో॥ చైత్రస్యప్రథమేపక్షే బుధవారేస్తిపంచమీ ।
భౌమోవాకురుతేస్వర్ఘం గోధూమస్య ఘృతస్యచ ॥

తా॥ చైత్ర శుక్ల పంచమీదినంబున బుధవారముగాని, మంగళవారముగాని సంభవించినయెడల గోధుమలకు, నేతికి ధర హెచ్చును.

శ్లో॥ చైత్రస్యపంచమీశుక్లా తత్రమేఘోజలంత్యజేత్ ।
శ్రావణేనచవర్షాస్యా దేవంజానీయతాంధ్రువమ్ ॥

తా॥ చైత్ర శుక్ల పంచమీదినంబున కొంచెమైనను మేఘంబులు వర్షించనేని ఆ సంవత్సరంబున శ్రావణమాసమం దెంతమాత్రము వర్షములేదని తా॥

శ్లో॥ దైత్యగురు స్త్రిదశానాం గురుశ్చ చైత్రస్యమాసే యదిచైకరాశౌ । గ్రాహ్యం ఘృతంవాతిలతైలసూత్రం ద్విమాసమధ్యే బహులాభకారీ ॥

తా॥ గురు శుక్రులు చైత్రమాసమందేకరాశిగతులైరేని నెయ్యి, నూనె, రసములను కొనియుంచినయెడల రెండుమాసములకు లోగా లాభముకలుగగలదని తా॥

శ్లో॥ చైత్రస్య శుక్లపక్షేచ తిథివృద్ధిర్భవేద్యది ।
కృష్ణేతుజాయతేహానిః ధాన్యేనపూరితామహీ ॥

తా॥ చైత్రశుక్లమందు తిథి వృద్ధిగలిగి కృష్ణపక్షమందుండు తిథి క్షయముగలిగినయెడల ఆసంవత్సరము ధాన్యము సమృద్ధిగానుండును.

శ్లో॥ వైశాఖేకృష్ణపక్షేచ సప్తమ్యాంశనివాసరే ।

భరణ్యాదిచతుర్వృక్షే యదాభౌమోభవిష్యతి ।
పిప్పలీ నారికేళంచ తామ్రం కాంస్యంచ పూగజం ।
తథాచ రక్తవస్త్రాణి తస్మిన్యోగే మహార్ఘతా ॥

తా॥ వైశాఖకృష్ణపక్షమందు, సప్తమీ శనివారమందు, భరణి మొదలు నాలుగునక్షత్రములందు అంగారకుఁడు సంచరించినయెడల పిప్పళ్లు, టెంకాయలు, రాగి, కంచు, వక్కలు, యెఱ్ఱబట్టలు వీటికి ధరలు హెచ్చును.

శ్లో॥ వైశాఖత్రయోదశీకృష్ణా యదాభౌమార్కవాసరా ।
మహార్ఘంఖాండతాంబూలం సైంధవం రక్తచందనం ।

తా॥ వైశాఖ కృష్ణ త్రయోదశీదినంబున ఆది, కుజవారములలో నొకవారము గూడినయెడల పటికబెల్లమునకు, తమలపాకులకు, సైంధవలవణమునకు, యెఱ్ఱచందనమునకు ధర హెచ్చును.

శ్లో॥ జ్యేష్ఠప్రతిపదాకృష్ణ భౌమార్కబుధవాసరా ।
ఏవంభవేద్యదాయోగో లోకానాంవ్యాధిపీడనమ్ ॥

తా॥ జ్యేష్ఠ బహుళ పాడ్యమి రవి, మంగళ, బుధవారములలో నేదైనను సంభవించిన లోకమందు ప్రజలకు వ్యాధికలిగియుండును.

శ్లో॥ సైషాప్రతిపదాపూర్ణా గుర్విందుశ్శుక్రవాసరాః ।
జలమధ్యేభవేత్పృథ్వీ పారావారసమాకులమ్ ॥

తా॥ జ్యేష్ఠ బహుళ పాడ్యమియే గురు, శుక్ర, చంద్రవారయుతమైనచో జలముతో భూమి నిండియుండును. అనఁగా అధికవర్షము గురియునని భావము.

శ్లో॥ అథవాసౌరివారేణ సైవంప్రతిపదాభవేత్ ।
దుర్భిక్షంరోగపీడాస్య క్షత్రభంగశ్చనాన్యథా ॥

తా॥ జ్యేష్ఠ బహుళ పాడ్యమి శనివారయుతమైనచో దుర్భిక్షము, రోగము, రాజ్యభంగము కలుగును.

శ్లో॥ జ్యేష్ఠమాసేత్వమావాస్యా దివావాయదివానిశి ।
ఆకాశేదృశ్యతేమేఘో హ్యనావృష్టిర్భయావహః ॥

తా॥ జ్యేష్ఠామావాస్యయందు పగలుగాని, రాత్రిగాని మేఘము

గాని వక్రించినయెడల నూలు (సూత్రం), మంజిష్ఠం వీట్లకు ధరగలిగి యుండును.

శ్లో॥ ఆశ్విత్రయోదశీయత్ర శనివారేభవిష్యతి ।
ఆదిత్యఃక్రమతేఋక్షం మన్నహీనాభవేన్మహీ ॥

తా॥ ఆశ్వయుజమాసంబున ౧౩ తిథి శనివారమున సంభవించి అప్పుడు సూర్యుఁడు నక్షత్రాంతరగతుఁడైనయెడల ప్రజలకుఅన్నము కష్టముగానుండును

శ్లో॥ ఆశ్వినే శనివక్రంచ బుధోరాశౌచలేత్తదా ।
శుక్రశ్చాస్తమితేయాతి తదాచసబలాకృషిః ॥

తా॥ ఆశ్వయుజంబున శనిఁవక్రించి అప్పుడు బుధుఁడు రాశ్యంతర్గతుఁడైయుండి నప్పుడు శుక్రుఁడు అస్తమించినచో చేసిన వ్యవసాయము ఫలించును.

శ్లో॥ ఆశ్వినేకృష్ణపక్షేచ సంహికేయస్తథాశనిః ।
శణసూత్రంఘృతం తైల మేతద్భావేమహార్ఘతా ॥

తా॥ ఆశ్వయుజ మాసమందు శని రాహువులు గూడినయెడల శనగలు, నూలు, నెయ్యి, నూనె వీట్లకు ధర హెచ్చును.

శ్లో॥ కార్తికప్రతిపద్యత్ర పరివేషంచదీయతే ।
తిలతైలంచవాణిజ్యం తానిసర్వాణినిష్ఫలమ్ ॥

తా॥ కార్తికశుక్ల పాడ్యమిదినంబున సూర్యునకు పరివేషముగలిగినయెడల నూనెమొదలైన వస్తువులయొక్క వర్తకం నిష్ఫలమగును.

శ్లో॥ మార్గశీర్షచతుర్దశ్యా మమావాస్యాంతథైవచ ।
ఘనచ్ఛాయావృతేభానౌ సుభిక్షంతత్రజాయతే ॥

తా॥ మార్గశీర్ష శుక్ల చతుర్దశ్యమావాస్యలయందు సూర్యుఁడు మేఘాచ్ఛాదితుఁడయ్యేనేని సుభిక్షముగలుగును.

శ్లో॥ మార్గశీర్షేసితే పక్షే ద్వితీయా శనివాసరే ।
దక్షిణేనవహతేవాతో లోకానాంకష్టదాభవేత్ ॥

తా॥ మార్గశీర్ష శుక్లద్వితీయాతిథియందు శనివారము సంభవించి దక్షిణాన వాయువు విసిరినయెడల లోకమునందు కష్టములుగనుండును.

చక్కగ వర్షించెనేని పిమ్మట నాలుగుమాసములుగూడ వర్షించును. సస్యసమృద్ధియు గల్గును.

శ్లో॥ భాద్రపదేష్టమీకృష్ణ రోహిణీశనివాసరే।
శుక్రార్కవాసరౌస్యాతాం యవగోధూమహార్ఘతా॥

తా॥ భాద్రపదకృష్ణాష్టమీ దినంబున రోహిణీ నక్షత్రము గూడి ఆదినంబున శనివారముగాని, శుక్రవారముగాని, ఆదివారముగాని గూడినయెడల యవ గోధూమలకు ధర హెచ్చును.

శ్లో॥ తథైవ పూర్వయోగేన ద్రవ్యమేతన్నిరీక్షయేత్।
హరిద్రాజీరకంచైవ పారదంసీసకంతథా॥

తా॥ పైన చెప్పిన యోగమందు పసుపు, జీలకఱ్ఱ, పాదరసము, సీసమును తప్పక ఖరీదుచేయవలయును.

శ్లో॥ కస్తూరీతిలతైలంచ గుడహింగుమహార్ఘతా।
రక్షయేదాత్రిమాసాంశ్చ పశ్చాద్విక్రయతాంధ్రువమ్॥

తా॥ కస్తూరి, నువ్వులనూనె, బెల్లము, ఇంగువ వీటిని మూడు మాసములపర్యంతము దాచి పిమ్మట విక్రయించవలెను.

శ్లో॥ భాద్రపదద్వితీయాయాం ఘనోహిదృశ్యతేక్వచిత్।
సంగ్రహస్సర్వధాన్యానాం షష్ఠేమాసేతువిక్రయేత్॥

తా॥ భాద్రపద శు ౨ దినంబున మేఘము చక్కగా కనబడిన యెడల సర్వధాన్యములు తప్పక కొనవలయును. పిమ్మట ఆఱుమాస ములకు విక్రయించిన లాభమువచ్చును

శ్లో॥ భాద్రపదేష్టమీశుక్లా చంద్రార్కౌతత్రనిర్మలౌ।
అన్నాదిసైంధవంసూత్రం పంచమాసేమహార్ఘతా॥

తా॥ భాద్రపద శు ౮ దినంబున చంద్రసూర్యులు నిర్మలులై యున్నయెడల భోజనవస్తువులకును, సైంధవలవణమునకును, నూలు కును, బట్టలకును అయిదుమాసములపైన కొంచెము ధర హెచ్చును.

శ్లో॥ ఆశ్వినేమాసికృష్ణేచ పక్షేచైవాష్టమీతిథౌ।
శనిర్వార్కోగురుశ్చైవ మహార్ఘాసూత్రమంజిష్ఠా॥

తా॥ ఆశ్వయుజ కృష్ణాష్టమీదినంబున బృహస్పతిగాని లేక శని

కనుపించెనేని అనావృష్టిగలుగును.

శ్లో॥ ఆషాఢే కృష్ణపక్షేచ హ్యష్టమ్యాం దృశ్యతేశశీ ।
భవేచ్చదినమధ్యేతు బహువృష్టేశ్చవర్షణమ్ ॥

తా॥ ఆషాఢ కృష్ణపక్షమందు అష్టమినాఁడు చంద్రుఁడు మేఘ మధ్యంగతుఁడాయెనా బహువర్షము గుఱియును.

శ్లో॥ అష్టమ్యాంనిశిచంద్రశ్చ నిర్మలంచోదయంభవేత్ ।
వర్షాకాలేతదాబ్దేతు జలంకూపేషుదృశ్యతే ॥

తా॥ ఆషాఢబహుళ అష్టమిరోజున చంద్రుఁడు నిర్మలముగానున్న యెడల ఆ సంవత్సరము కూపమందు జలము సమృద్ధిగా నుండును. కొంత అనావృష్టియును కలుగగలదు.

శ్లో॥ ఆషాఢ్యాఃపూర్ణిమాయాశ్చ యథావృద్ధిర్భవిష్యతి ।
మాసత్రియంసుభిక్షంచ పశ్చాద్యాతిసుభిక్షతా ॥

తా॥ ఆషాఢ శుక్ల పూర్ణిమదినంబున పూర్ణిమ వృద్ధిగలిగియుండె నేని మూఁడుమాసములు సుభిక్షముగను, అటు పిమ్మట దుర్భిక్షము గూడ కలుగగలదు.

—✱ ఆషాఢ శుక్ల పూర్ణిమా ఫలమ్ ✱—

శ్లో॥ ఆషాఢేపూర్ణిమాయాంతు యదిచంద్రోనదృశ్యతే ।
చతురాదితమాసాంశ్చ తథాముంచంతిమాధవః ॥

తా॥ ఆషాఢ శు ౧౫ దినంబునరాత్రి చంద్రుఁడు కనఁబడకయుం డిన నాలుగుమాసములు చక్కగా వర్షించును. ఒకవేళ చంద్రుఁడు ఆదినంబున కనఁబడినట్లాయెనా వర్షము లేకయుండును.

శ్లో॥ శ్రావణేశుక్లసప్తమ్యాం యదిమేఘఃప్రవర్తతే ।
భవంతిసర్వసస్యాని ధనధాన్యసమాకులమ్ ॥

తా॥ శ్రావణ శుక్ల సప్తమీదినంబున మేఘములు వర్షించెనేని సర్వసస్యములు చక్కగ ఫలించును.

శ్లో॥ శ్రావణేకృత్తికాయత్ర తత్రతోయం యదాభవేత్ ।
చత్వారోమాసవర్షంతి సర్వసస్యవివర్ధనమ్ ॥

తా॥ శ్రావణమాసంబున సంభవించు కృత్తికానక్షత్రదినంబున

శ్లో॥ పౌషస్య పంచమీకృష్ణా భౌమవారోయదాభవేత్ ।
తథాచవర్షణంవృష్టేః కృషినిష్పత్తిరుత్తమా ॥

తా॥ పుష్య కృష్ణ పంచమీ దినంబున మంగళవారమయ్యె నేని వర్షముకురిసి పైరులు చక్కగా ఫలించును.

శ్లో॥ నవమ్యేకాదశీపౌషే పూర్వేచఘనగర్జితం ।
ధాన్యంమహర్ఘతాంయాతి మజ్జామేదోనదృశ్యతే ॥

తా॥ పుష్యమాస నవమీ ఏకాదశితిథులయందు తూర్పుదిక్కున మేఘము ఉరిమినయెడల ధాన్యమునకు ధర హెచ్చును. శరీరమందు నెత్తురు, మాంసము యివి చాలా తగ్గియుండును.

శ్లో॥ అథాస్మిన్నేవయోగేతు పశ్చిమే చలనంమహత్ ।
ధారాధరానవర్షంతి హ్యన్నహీనాభవేన్మహీ ॥

తా॥ పై యోగమందే పశ్చిమదేశమందు చలనముగలిగినయెడల వర్షముకురువదు. ప్రజలకు సకాలంబున అన్నములేకయుండును.

శ్లో॥ పౌషస్యకృష్ణేచాష్టమ్యాం నిశీథేగర్జతేఘనే ।
వర్షాకాలేచతుర్మాసే సజలంవర్షతిర్ఘనః ॥

తా॥ పుష్యకృష్ణాష్టమీదినంబున అర్ధరాత్రియందు మేఘము ఉరిమినచో రాబోవు వర్షాకాలము నాలుగుమాసములు వర్షించును.

శ్లో॥ పౌష్యశుక్లత్రయోదశ్యాం వారసౌరిఃకుజస్తథా ।
ఘనైర్నముచ్యతేతోయం గోధూమాద్యస్యసంగ్రహః

తా॥ పుష్య శుక్ల త్రయోదశినాడు శనివారముగాని. మంగళవారముగాని కూడినయెడల వర్షములోపించును. గోధూమాదిధాన్యములు తప్పక నిలువచేయవలెను,

శ్లో॥ మాఘస్యకృష్ణపక్షేతు ద్వితీయాతృతీయాదినే ।
శుక్రసౌరీభవేతాంవై శస్త్రయుద్ధంమహీతలే ॥

తా॥ మాఘ బహుళ 2-3 తిథులందు శుక్ర శనివారములుగూడిన యెడల భూమియందు ప్రజలకు శస్త్రయుద్ధములు సంభవించును.

శ్లో॥ అథాస్మిన్నేవసంయోగే సన్ముఖేభవతేగురుః ।
వర్షతేద్దేవతాజశ్చ్ఛ చ్ఛుఖసౌఖ్యం ప్రజాయతే ॥

తా॥ పైయోగమందు బృహస్పతి చేరినయెడల ఇంద్రునివలన వర్షించును. సౌఖ్యముగానుండును.

శ్లో॥ మాఘమాసేకృష్ణపక్షే పంచమీషష్ఠిసప్తమీ ।
శుక్రసౌరీతథాచంద్ర ఏకాంతేసంగమోయది ॥

తా॥ మాఘ కృష్ణపక్షమందు పంచమీ-షష్ఠి-సప్తమీతిథులందు క్రమముగా శుక్ర, శని, సోమవారములు గూడిన ఒకరికొకరుచేరినను వర్షించును.

శ్లో॥ శ్రావణేభాద్రపదేచైవ వర్షంతివిపులంఘనం ।
అతులాకృషినిష్పత్తిః పుష్కలంసౌఖ్యమాప్నుయాత్ ॥

తా॥ శ్రావణ భాద్రపదమాసములందు విస్తారముగా వర్షించును. సస్యములు చక్కగాఫలించును. సౌఖ్యముగలుగును.

శ్లో॥ ఏతేషాంయోగమధ్యేతు హ్యేకోపిభవతేయది ।
గోధూమశాలిముద్గాశ్చ భాద్రమాసేమహార్ఘతా ॥

తా॥ పై యోగములమధ్యను ఒకయోగముగలిగినయెడల గోధుమలకును, ధాన్యమునకును, పెసలకును ధర హెచ్చును.

శ్లో॥ మాఘమాసేత్రయోదశ్యాం తుషారఃపతితోయది ।
సర్వధాన్యసమర్ఘాణి మేదినీ సుఖమండితా ॥

తా॥ మాఘ శుక్ల త్రియోదశీ దినంబున స్వల్పవర్షము పడిన యెడల సర్వ ధాన్యములకు ధర సమానముగా నుండును. మఱియు ప్రజలకు సౌఖ్యముగలుగును.

శ్లో॥ ఫాల్గుణేచైత్రమాసేచ పక్షద్వయతిథీషుచ ।
వక్రంయాతఃశనిర్భౌమః శీఘ్రంగృహ్ణీతధాన్యకమ్ ॥
పక్షాంతేహ్యథవామాసే ద్విభావశ్చతుర్గుణః ।
యేనరానైవగృహ్ణంతి పశ్చాత్తాపంభజంతితే ॥

తా॥ ఫాల్గుణ చైత్రమాసములయందు పక్షద్వయ తిథులలో శని కుజులు వక్రించిరేని శీఘ్రముగా ధాన్యమును ఖరీదు చేయవలెను. వానివాని అదృష్టమువలన ౧౫ రోజులకుగాని, ౧ మాసమునకుగాని నాలుగురెట్లు లాభముకలుగును. ఈయోగమందు దెవ్వరు ధాన్యమును

కొనరో వారు పిమ్మట పరితాపముగలవారగుదురు.

శ్లో॥ ఫాల్గుణేహిగురోశ్చాస్తం రాశివక్రింతుజాయతే ।
క్వచిద్ధాన్యంసమర్ఘంచ సర్వంరోగోనదృశ్యతే ॥

తా॥ ఫాల్గుణమాసమందు గురువు అస్తమయమునుగాని, వక్రత్వ ముసుగాని బొందినయెడల ధాన్యముసకుమాత్రము సమార్ఘముగానుం డును. అనఁగా సరసముగా నుండుసనుట. ప్రజలకు రోగములుండవు.

శ్లో॥ ఫాల్గుణస్యహ్యమావాస్యా మస్తంచకుజతేభృగుః ।
సర్వంచలభతేదీర్ఘం ధాన్యస్యనాత్రసంశయః ॥

తా॥ ఫాల్గుణ బ 30 దినంబున కుజుఁడు, శుక్రుఁడు అస్తమించిన యెడల ధాన్యమునకు ధర హెచ్చును. ఈవిషయమున సంశయింపఁ బనిలేదు.

శ్లో॥ మాసద్వాదశమధ్యేతు యత్రవర్షతిపూర్ణిమా ।
తత్రత్రైవసుభిక్షంచ గోధూమఘృతతండులాః ॥

తా॥ ద్వాదశమాసములలో నేమాసమందు పూర్ణిమ వర్షించునో ఆమాసమందు సుభిక్షము తప్పక కలుగును.

శ్లో॥ యదామలిమ్లుచేమాసే రాశిచారగతశ్శనిః ।
తద్భయంభవతేభూమా వజ్రపాతేననిశ్చయమ్ ॥

తా॥ మలమాసమునందు శని రాశ్యంతరమును బొందినయెడల భూమియందు పిడుగులుపడి ప్రజలు నశింతురు.

శ్లో॥ రాశౌమలిమ్లుచేమాసే చలతోగురుమంగలౌ ।
అథవామధ్యమావృష్టి ర్నభసిశ్రావణేభవేత్ ॥

తా॥ మలమాసమందు గురు కుజులు చలించినయెడల శ్రావణ భాద్రపదమాసములలో మధ్యమవృష్టిప్రదముగానుండును.

## గ్రహవక్ర అతిచార ఫలము.

శ్లో॥ అన్యానహంప్రవక్ష్యామి గ్రహాతిచారవక్రయోః ।
చంద్రసూర్యప్రకాశాని ఫలంభవతినిశ్చయమ్ ॥

తా॥ ఇఁక ముందు గ్రహముల అతిచార వక్రగతి ఫలమునున్ను, రవి చంద్రప్రకాశముల ఫలమునున్ను జెప్పఁబడును.

శ్లో॥ క్షితిజోవక్రిభూతోపి దుర్భిక్షంచమహద్భయం ।
ఆరక్తానిచద్రవ్యాణి తానిసర్వామహార్ఘతా ॥

తా॥ అంగారకుఁడు వక్రించినయెడల దుర్భిక్షము, భయము, ఇది గాక రక్తధాన్యములకు ధర హెచ్చుటయును గలుగును.

శ్లో॥ ధనేమీనేయదాచైవ మంగలోవక్రితేతదా ।
ధాన్యంఘృతంమహర్ఘంచ భయభీతాచమేదినీ ॥

తా॥ అంగారకుఁడు ధనుర్మీనములందు వక్రించెనేని ధాన్యము, నేయి వీట్లకు ధరగలిగియుండును. భయముగూడ గలుగును.

శ్లో॥ శుక్రగేహేయదావక్రీ జాయతేక్షితినందనః ।
దుర్భిక్షందేశభంగంచ లోకానాంచమహద్భయమ్ ॥

తా॥ అంగారకుఁడు వృషభతులలందు వక్రించెనేని దుర్భిక్షము, దేశభంగము, భయము గలుగును.

శ్లో॥ బుధోవక్రీయదాభూత ఇక్ష్వాదీనాంమహార్ఘతా ।
సుభిక్షంసర్వధాన్యాని భవిష్యంతి నసంశయః ॥

తా॥ బుధుఁడు వక్రించినయెడల చెఱకునకు ధర హెచ్చును. సుభిక్షము, సర్వసమృద్ధిగా నుండును.

శ్లో॥ వక్రీభూతోయదాజీవః సుభిక్షంభూతలేభవేత్ ।
జనభూపాలసౌఖ్యంస్యా త్సమర్ఘంగోరసంఘృతమ్ ॥

తా॥ గురువు వక్రించెనేని భూమియందు సుభిక్షము గలుగును. రాజులకు, ప్రజలకు సౌఖ్యము గలుగును. నెయ్యి, పాలు ధరగలిగి యుండును.

శ్లో॥ మఘాయాంగురువక్రంచ సుభిక్షంనృపతేస్సుఖం ।
పుణ్యామార్గంతదాగమ్యం ఘృతస్యార్ఘంప్రదీయతే ॥

తా॥ మఘయందు గురువు వక్రించెనేని సుభిక్షము, నేతికి ధరయును, రాజునకు సౌఖ్యము, పుణ్యమార్గగమనము సంభవించును.

శ్లో॥ ఆత్మగేహేభవేత్సౌరి ర్గురుర్వక్రిత్వమాగతే ।
ధాన్యానిసంగ్రహేద్యస్తు తస్యలాభశ్చతుర్గుణః ॥

తా॥ గురువు వక్రించెనేని, శని మకర కుంభములం దుండెనేని

ధాన్యము కొన్నవారికి లాభము నాలుగురెట్లు గలుగును.

శ్లో॥ యదాదైత్యగురుశ్చైవ రాశివక్రంచరిష్యతి ।
ధాన్యార్ఘంచక్షయంకుర్యాత్ ఘృతతైలమహార్ఘతా ॥

తా॥ శుక్రుఁడు వక్రించెనేని ధాన్యమునకు ధర తగ్గును. నేతికి, నూనెకు ధర హెచ్చును.

శ్లో॥ వృషేతులేయదాకర్కే వక్రీభూత్వాభృగుస్థితః ।
పునర్మార్గేయదాయాతి సుఖీస్యాన్నృపతిఃప్రజాః ॥

తా॥ శుక్రుఁడు వృష తులా కటకములందు వక్రించి, తిఱిగి ఋజు గతినిబొందినచో అందరికి సుఖముగలుగును.

శ్లో॥ భరణ్యాంవక్రితేసౌరి రధవాచాశ్వినీభవేత్ ।
వత్సరేతత్రపీడాస్యా ద్ధాన్యనాశం చతుష్పదః ॥

తా॥ భరణియందుగాని, అశ్వినియందుగాని శని వక్రించిన ఆ సంవత్సరమందు పీడ, ధాన్యనాశనము, పశునాశనము గలుగును.

శ్లో॥ మఘాయాంవక్రితేసౌరిః శ్లేషాయాంగచ్ఛతేయది ।
గోధూమఘృతశాలీనాం మహార్ఘంపరిబలంభవేత్ ॥

తా॥ శని మఘయందు వక్రించి ఆశ్లేషకు వచ్చినయెడల గోధుమలకు, నేతికి, నూనెకు ధర హెచ్చును.

శ్లో॥ కన్యామీనేయదాసౌరీ రాశివక్రంప్రజాయతే ।
నృపయుద్ధంభయంలోకే దుర్భిక్షంతత్రజాయతే ॥

తా॥ శని కన్యామీనములందు వక్రించినయెడల రాజులకు యుద్ధమును, దుర్భిక్షమును గలుగును.

శ్లో॥ జ్యేష్ఠాంశనికృతంవక్రి మనూరాధాంచగచ్ఛతి ।
యానికానిచ ద్రవ్యాణి సమస్తార్ఘం ప్రదీయతే ॥

తా॥ శని జ్యేష్ఠయందు వక్రించి అనూరాధకు వచ్చినయెడల సర్వద్రవ్యములకు ధర హెచ్చును.

శ్లో॥ ఉత్తరాయాంకృతేవక్రే పూర్వాషాఢేప్రజాయతే ।
అపూర్వాం భవతేకాలం ధనాఢ్యోబహుపీడ్యతే ॥

తా॥ ఉత్తరాషాఢయందు శని వక్రించి పూర్వాషాఢకు వచ్చిన

మొదల కాలం విపరీతముగానుండును. ధనికులకుమాత్రం బాధగల్గును

శ్లో॥ గురుసంగేశనేర్వక్రిం భవేదాత్మగృహేస్ఫుటం ।
గోధూమతిలతైలంచ నవమాసంమహార్ఘతా ॥

తా॥ శని మకరమందు గురువుతోగూడి వక్రించినచో గోధూమ తిల తైలములకు తొమ్మిదిమాసములకుపిమ్మట ధర హెచ్చును.

శ్లో॥ క్రూరగ్రహోయదాకోపి అతిచారోపిజాయతే ।
దుర్భిక్షంనృపపీడాచ శుభంనదృశ్యతేక్వచిత్ ॥

తా॥ క్రూరగ్రహము అతిచారగతుడై యుండిన దుర్భిక్షము, రాజపీడ గలుగును.

శ్లో॥ శుభగ్రహోయదాకోపి హ్యతిచారంతుగచ్ఛతి ।
సుభిక్షంసర్వధాన్యేషు సౌఖ్యంసర్వంప్రవర్తతే ॥

తా॥ శుభగ్రహము అతిచారగతుడైనయడల సర్వత్ర సుఖము గలుగును.

శ్లో॥ అతిచారంగతేసౌమ్యే వక్రభూతోబృహస్పతిః ।
సుభిక్షంనవఖండేషు రాజ్యాభోగకృతామహీ ॥

తా॥ శుభగ్రహములు అతిచారగతులై యుండిరేని అప్పుడు బృహస్పతి వక్రించిన నవఖండములందు సౌఖ్యముగలుగును. రాజగౌరవముగూడ గలుగును.

శ్లో॥ యదాక్రూరాగతావక్రిం అతిచారేతుసౌమ్యకం ।
పీడా వ్యాధిభయంతత్ర దుర్భిక్షం రాజ్యవిగ్రహమ్ ॥

తా॥ క్రూరగ్రహములు వక్రించి, శుభగ్రహము అతిచారగతులయినచో వ్యాధి, పీడా, దుర్భిక్షములు గలుగును.

## చంద్ర పరివేష ఫలము.

శ్లో॥ అశ్వినీంభరణీంచైవ కృత్తికాయాంతథైవచ ।
మండలందీయతేచంద్రో వాణిజ్యంగృహ్యతేబుధైః ॥

తా॥ అశ్విని, భరణి, కృత్తికలయందు చంద్రునకు మండలము సంభవించినప్పుడు చేసినవర్తకము లాభకరము.

శ్లో॥ యదాపునర్వసౌబుష్యే మండలందీయతేశశీ ।

పశ్చిమోత్తరదేశేషు మేఘవృష్టిః ప్రజాయతే ॥

తా॥ చంద్రుఁడు పునర్వసునక్షత్రమందు మండలగతుఁడైన పశ్చిమోత్తరదేశములందు వర్షముగలుగును.

శ్లో॥ నిశాపతిర్యదాపుష్యే మండలందీయతేపునః ।
సర్వత్రవృష్టిర్భవతి ద్వితీయేతృతీయేదినే ॥

తా॥ చంద్రుఁడు పుష్యమినాఁడు మండలగతుఁడైనచో రెండు మూఁడురోజులకు వర్షముకురిసియును.

శ్లో॥ చిత్రాయామథవాస్వాతౌ నిశాపతిర్యదాభవేత్ ।
ప్రకాశంకురుతేభాను ర్మేఘవృష్టిస్తథోఽచ్యతే ॥

తా॥ చిత్రయందుగాని, స్వాతియందుగాని చంద్రసూర్యులు ప్రకాశవంతులాయెనా వర్షముకురిసియును.

శ్లో॥ ఉత్తరాహస్తచిత్రాయాం స్వాతౌచైవవిశేషతః ।
మండలందీయతేచంద్రౌ వృష్టిస్తత్రభవేద్ధ్రువమ్ ॥

తా॥ ఉత్తర, హస్త, చిత్రలయందు చంద్రుఁడు మండలగతుఁడాయెనా వర్షముకురిసియును.

శ్లో॥ మీనసంక్రాంతికాలేచ పౌష్ణభోగైర్భవేద్దినం ।
యత్రబిందుర్భవేన్నాత్ర తత్రగర్భంభవేద్ధ్రువమ్ ॥

తా॥ మీనసంక్రాంతియందును, రేవతియందును సూర్యుఁడుండఁగా బిందువులుగలిగిన అప్పుడు వర్షించదు. గర్భము ధరించియుండిన వర్షము గురిసియును.

—♦ గురు నక్షత్రసంచార ఫలము ♦—

శ్లో॥ కృత్తికాంభరణీంచైవ యదితిష్ఠేద్బృహస్పతిః ।
మధ్యమాజాయతేవృష్టిః సస్యంభవతిమధ్యమమ్ ॥

తా॥ బృహస్పతి భరణి, కృత్తికలందున్నయెడల మధ్యమవృష్టి, మధ్యమసస్యములు గలుగును.

శ్లో॥ ఆర్ద్రాయాంమృగశీర్షేచ యదియాతిబృహస్పతిః ।
క్షేమంభవతిచారోగ్యం సర్వత్రభవతేసుఖమ్ ॥

తా॥ బృహస్పతి ఆర్ద్రయందును, మృగశీర్షయందును నున్నప్పుడు

సర్వత్ర క్షేమము ఆరోగ్యముగా నుండును.

శ్లో॥ పునర్వసౌతథాపుష్యే శ్లేషాయాంగచ్ఛతేగురుః ।
స్వల్పవృష్టిర్భవేత్తత్ర దుర్భిక్షంచవినిర్దిశేత్ ॥

తా॥ బృహస్పతి పునర్వసు, పుష్యమి, ఆశ్రేషలం దున్నయెడ స్వల్పవృష్టి, దుర్భిక్షములు గలుగును.

శ్లో॥ మఘాయాంపూర్వఫల్గుణ్యాం యదియాతిబృహస్పతిః ।
క్షేమంసుభిక్షమారోగ్యం సువృష్టిశ్చైవజాయతే ॥

తా॥ గురువు మఘయందుగాని, పూఫ యందుగాని వున్నయ క్షేమము, సుభిక్షము, వర్షము కలుగును.

శ్లో॥ ఉత్తరాఫల్గుణీహస్తే దేవాచార్యోయదాభవేత్ ।
క్షేమంభవతిచారోగ్యం సువృష్టిశ్చప్రజాయతే ॥

తా॥ గురువు ఉత్తరాహస్తలందున్న క్షేమము, ఆరోగ్యము, వృష్టి గలుగును.

శ్లో॥ చిత్రాయాంచైవస్వాతౌచ యదితిష్ఠే ద్బృహస్పతిః ।
విచిత్రంవర్షతేదేవో విచిత్రాస్సస్యసంపదః ॥

తా॥ గురువు చిత్ర స్వాతులందున్న విచిత్ర వృష్టి, విచిత్ర స ములు గలుగును.

శ్లో॥ విశాఖాచానురాధాయాం యదాహిగచ్ఛతేగురుః ।
మధ్యమాభవతేవృష్టిః సస్యంభవతిమధ్యమమ్ ॥

తా॥ బృహస్పతి విశాఖ, అనూరాధలం దున్నప్పుడు మధ్య వృష్టి, మధ్యమఫలము గలుగును.

శ్లో॥ జ్యేష్ఠామూలేచనక్షత్రే గచ్ఛతే నిర్జరోగురుః ।
ద్విమాసంవర్షతేదేవః కన్యాయాంనైవవర్షతి ॥

తా॥ బృహస్పతి జ్యేష్ఠ, మూలలందున్నప్పుడు రెండుమాసము వర్షించును. కన్యాసంక్రాంతియందు వర్షించదు.

శ్లో॥ పూర్వాంవాఉత్తరాషాఢం యదాగచ్ఛతివాక్పతిః ।
త్రిమాసంవర్షతిర్దేవో మాసమేకంనవర్షతి ॥

తా॥ బృహస్పతి పూర్వాషాఢ, ఉత్తరాషాఢలయం దున్నప్పు

మూడుమాసములు వర్షించును. ఒకమాసము వర్షించదు.

శ్లో॥ శ్రవణేచధనిష్ఠాయాం శతతారేయధాగురుః ।
క్షేమంగుశలమారోగ్యం సుభిక్షుంచవినిర్దిశేత్ ॥

తా॥ బృహస్పతి శ్రవణ, ధనిష్ఠ, శతభిషములయం దున్నప్పుడు క్షేమము, కుశలము, ఆరోగ్యము, సుభిక్షము కలుగును.

శ్లో॥ పూర్వాభాద్రోత్తరాభాద్రే యదియాతిబృహస్పతిః ।
అనావృష్టిఃభయంఘోరం దుర్భిక్షంతత్రజాయతే ॥

తా॥ బృహస్పతి పూర్వాభాద్ర,ఉత్తరాభాద్రలయందున్నప్పుడు వర్షముకురువదు. భయంకరమైన అనావృష్టిగలుగును.

శ్లో॥ రేవత్యాంమీనరాశౌచే ద్యదితిష్ఠేద్బృహస్పతిః ।
సుభిక్షంక్షేమమారోగ్యం తదాసస్యవతీమహీ ॥

తా॥ బృహస్పతి రేవతియందును, మీనరాశియందు నున్నప్పుడు సుభిక్షము, క్షేమము, ఆరోగ్యము గలుగును.

—♦ సంక్రాంతిప్రవేశ వారఫలములు ♦—

శ్లో॥ సంక్రాంతి రాదిత్యదినేన శస్త్రా కరోతియుద్ధం నృపతేరతీవ ।
ధాన్యం మహార్ఘం ప్రతి రౌద్రవార్తాం ప్రజాభవే ద్దుఃఖిత హీనదీనా ॥

తా॥ సంక్రాంతిప్రవేశము ఆదిత్యవారమందైతే రాజులకు యుద్ధములు సంభవించును. ధాన్యముధర హెచ్చును. భయవార్తలుగలుగును. అందరికి దుఃఖములుగలుగును.

శ్లో॥ ప్రవాళముక్తా ధనధాన్యసంకులా ప్రజాసుఖం నందతి సర్వదా జనః । సర్వం సమర్ఘం భవతేహధాన్యం కరోతి చంద్రే రవి సంక్రమశ్చేత్ ॥

తా॥ సంక్రాంతి ప్రవేశము సోమవారమందయితే పగడములు, ముత్యములు, ధనము, ధాన్యము సమృద్ధిగానుండును. సర్వత్ర సుఖం గలుగును. ధాన్యమునకు సమార్ఘము గలిగియుండును.

శ్లో॥ భౌమశ్చవారే యదిసంక్రమశ్చ కరోతిపృథివీ మసుఖం మహార్ఘతా । రసంచ లవణం ఘృత తైలసంయుతం కర్పూరకం

చైవ మహార్ఘతాచ ॥

తా॥ సంక్రమణ ప్రవేశము మంగళవారమందయితే సర్వత్ర దుఃఖము, అత్యర్ఘముగా నుండును.

శ్లో॥ బుధశ్చవారే యది సంక్రమశ్చే త్సమానవస్తూని భవేచ్ఛ ధాన్యం । అసౌఖ్యలోకా భయ భీతి పీడా సువృష్టికాలేషుచ మందవర్షా ॥

తా॥ సంక్రాంతి ప్రవేశము బుధవాసరమందైతే మధ్యమసమృద్ధి, అసౌఖ్యము, భయము, పీడ, అల్పవృష్టి గలుగును.

శ్లో॥ గురోశ్చవారే యది సంక్రమశ్చే త్సమానవస్తూని భవంతి నిత్యశః । పృథ్వీ సదానందతి ధర్మ కర్మణా భవేచ్ఛ భూమిః ప్రచురాన్నపూర్ణా ॥

తా॥ సంక్రాంతిప్రవేశము గురువారము సంభవించినచో వస్తువులకు ధరలు సమానముగా నుండును. భూమియందు అన్నము సమృద్ధిగానుండును. సమస్తమైనవారికిని ఆసంవత్సరము సౌఖ్యముగానే యుండును.

శ్లో॥ శుక్రస్యవారే రవిసంక్రమశ్చే త్సమర్ఘతాం యాతి తదాచ ధాన్యం । నిర్మూల్య అశ్వాశ్చగజాశ్చఉష్ట్రాః గతార్ఘతైలం గుడమర్ఘతాంచ ॥

తా॥ సంక్రాంతిప్రవేశము శుక్రవారమందైతే ధాన్యమునకు మాత్రము సమార్ఘముగలదు. గుఱ్ఱములు, ఏనుగులు, ఉష్ట్రములు వీనికి ధరతగ్గును. నూనె, బెల్లము వీట్లకు ధరగలిగియుండును.

శ్లో॥ సౌరేశ్చవారేరవిసంక్రమశ్చే ద్దుర్భిక్షమాయాతిచ సర్వధాన్యమ్ । పృథ్వీసరోగానృపతే రతీవద్భ్యైతభూమా నరరుద్రముష్టితా ॥ ప్రజాసుభవేన్మహాయుద్ధభయమ్ ॥

తా॥ సంక్రాంతి శనివారమందైతే సర్వధాన్యములు ప్రియముగా నుండును. ప్రజలకు రోగములు మెండుగనుండును. రాజులకును, ప్రజలకును యుద్ధముకలుగును.

శ్లో॥ కృష్ణేషవృద్ధిఃక్షయశ్శుక్లే మందార్కకుజసంక్రమః ।

అనావృష్టిగతామేఘాః పరచక్రంవినిర్దిశేత్ ॥

తా॥ కృష్ణపక్షమందు తిథివృద్ధియును, శుక్లపక్షమందు తిథిక్షయమును గలిగినను, మఱియు శని - రవి - కుజవారములందు సూర్యసంక్రాంతి సంభవించినను ఆసంవత్సరమున అనావృష్టి గలుగును. ఇదిగాక రాజ్యక్షోభయును గలుగును.

—* మఱికొన్ని విషయములు *—

ప్రతి సంవత్సరంబున మృగశీర్ష కార్తెలో వర్షమును, మఘ కార్తెలో ఉఱుములును, స్వాతికార్తెలో మెఱుపులును సంభవించిన పక్షంబున ఆసంవత్సరంబున వర్షము చక్కగా భూమియందు పడునని తెలియవలయును. మఱియు చిత్ర- స్వాతి- విశాఖ యీకార్తుల యందు వర్షించితే కొంతప్రదేశము సౌఖ్యముగలిగియుండును.

---

అరవ మతప్రకారము ఆని ౧౦ తేదీ, ఆడి ౮ తేదీ, ఆవణి ౬ తేదీ, పెరటాశి ౪ తేదీ, అల్పిశి ౨ తేదీ, కార్తికి ౧ తేదీ ఈతేదుల యందు వర్షముపడిన ఆసంవత్సరం సుభిక్షముగానుండును.

---

—♦ సంవత్సర ఫలసూచన ♦—

ఏసంవత్సరంబున సుభిక్షము తెలిసికొనవలయునో ఆసంవత్సరమువఱకు ప్రభవాదిగా నెంచి ఆసంఖ్యను ౨ చే గుణించి యా మొత్తములో మూఁడు తీసివేసి ౭ చే భాగించగా వచ్చిన శేషము ౧-౪ అయితే సుభిక్షము, ౨-౫ అయితే దుర్భిక్షము, 3-౬ అయితే సమము, శూన్యమయితే ఫలశూన్యమని తెలియవలయును.

—* జల నిర్జల రాసులు *—

| | |
|---|---|
| కటకం-మకరం-మీనం- జలరాసులు | కార్తులయొక్క ప్రవేశ |
| ధనస్సు-కుంభం-వృషభం-అర్ధజలరాసులు | కాలము ననుసరించి |
| మేషం-తులా-వృశ్చికం- పాదజలరాసులు | ఫలము చూడఁదగును. |
| మిథునం-సింహం-కన్య- నిర్జలరాసులు | |

---

## ——♦ గ్రహ వక్రాది వర్షసూచనము ♦——

శ్లో॥ గురుర స్తంగతే వృష్టిః సువృష్టి ర్భార్గవోదయే ।
చలత్యంగారకో వృష్టిః స్త్రీభిర్వ్యష్టిశ్శనైశ్చరః ॥

తా॥ గురువు అస్తమయము, శుక్రోదయము, అంగారకచలనము, శనికిమాత్రం అస్తమయము, శనోదయము, శని చలనాదులందు చక్కగా వర్షించునని పూర్వము దైవజ్ఞులచే చెప్పఁబడినది. 'విపరీతే విపర్యయః' అనికూడా చెప్పిరి. కేవలము ఒకగ్రహము ననుసరించి కొంతఫలము చెప్పునప్పుడు గ్రహస్థిత నక్షత్రమునుగూడ శోధించి ఫలముఁ జెప్పవలయునని ముఖ్యాభిప్రాయము.

## ——♦ కుజ స్తంభన ♦——

శ్లో॥ సప్తభిశ్చాష్టభిర్మాసై రేకరాశిస్థితే కుజే ।
కుజస్తంభాఖ్యదోషోఽయం నృపరాష్ట్రవినాశకృత్ ।
మేషేధనుర్మీనవృషాళిసింహే ధరాసుతస్సూర్యసుతశ్చ వక్రః॥

## ——♦ కాలసర్ప దోషము ♦——

శ్లో॥ అగ్రేరాహురధో కేతు స్సర్వేమధ్యగతాగ్రహాః ।
యోగోఽయంకాలసర్పాఖ్యో నృపసస్యవినాశనమ్ ॥

## ——♦ శనైశ్చర కుజ గురు సంచారము ♦——

శ్లో॥ భౌమేజ్యమందాయదివకరాశౌ పతస్పరంసప్తమశేన్వితాస్యుః। సాకేతలంకాపుర మధ్యదేశే క్షుధాభయం శస్త్రభయం ప్రజానామ్ ॥ ఇనసూనుగతా దార్శే స్త్రీషటాయుగతే రవౌ । వింధ్యాద్రి లంకయోర్మధ్యే పతంతి శవకోటయః ॥

## ——♦ స్త్రీ పురుష నక్షత్ర నిర్ణయము ♦——

శ్లో॥ సార్పాచతుష్కవసువారియుగ్మం త్వాష్ట్రత్రయంవిశ్వయమంచ శక్రే । స్త్రీలింగ తారా విరు సేందు మూలా తారా నపుంసా పురుషాఃపరాస్యుః ॥

తా॥ ఆశ్లేష, మఘ, పూఫ, ఉఫ, ధనిష్ఠ, పూషా, ఆర్ద్ర, చిత్ర, స్వాతి, విశాఖ, ఉషా, భరణి, జ్యేష్ఠ యివి స్త్రీతారలు. శతభిషం, మృగశీర్ష, మూల నపుంసకతారలు. అశ్విని, కృత్తిక, రోహిణి,

పునర్వసు, పుష్యమి, హస్త, అనూరాధ, శ్రవణం, పూర్వాభాద్రా, ఉత్తరాభాద్ర, రేవతి పురుష తారలు.

తత్ఫలం॥ శ్లో॥ స్త్రీస్త్రీవ్యసనంకుర్యాత్ స్త్రీపురసావృష్టిరుచ్యతే।
స్త్రీనపుంసకయోర్వాయుః పుంపుమాంనాదాహకస్మృతః॥

## అర్ఘవృద్ధి నిర్ణయము

శ్లో॥ అమాయా మధికంబుక్షం అర్ఘో వర్ధతివర్ధతి।
బుక్షాధికాహ్యమావాస్యా అర్ఘో హ్రాస్వతిహ్రాస్వతి॥

తా॥ అమావాస్య తిథి ఘడియలకంటె నక్షత్ర ఘడియలు అధికమైనయెడల అర్ఘవృద్ధి యని చెప్పవలయును. నక్షత్ర ఘడియలు తక్కువై అమావాస్య అధికమైనచో అర్ఘవృద్ధి తగ్గిపోవును.

## మతి యొకవిధం

శ్లో॥ సంక్రాంతిబుక్షం తిథి వార మిశ్రితం సప్తాహతం పావక భక్తశేషం। సమే సమంస్యా ద్విషమేచవృద్ధిం శూన్యేతుశూన్యం ప్రవదంతిచార్ఘమ్॥

## ధనకుః యోగము

శ్లో॥ రవ్యంగారకగురుశనివారే వింశత్తారే (౨౦). ధనకుఃయోగః॥ (ధనుస్సంక్రమణము) యగుణ (౧-౨) ద్విగుణ (౨-౪) త్రిగుణ (౩-౯) చౌదబారే (౪-౧౬) అన్యత్తారేధనకుఃయోగః॥ (అన్యత్తారే = ఇతరనక్షత్రమైతే)

## ప్రాచీనగ్రంథే అర్ఘనిర్ణయః.

(చైత్రే) శ్లో॥ స్వర్ణరత్నగుడైర్మాష ప్రివాళంచయుగంధరీ। లశునా శ్వాదికానాంచ మహార్ఘంచైత్రిపూర్ణిమాత్॥

తా॥ మాస నామనక్షత్రములతో మాసపూర్ణిమ గూడినయెడల ధరలను నిర్ణయింపఁబడుచున్నది. చైత్ర పూర్ణిమయందు చిత్రా నక్షత్రము సంభవించినయెడల బంగారము, రత్నములు, గుడము, ఫగడము, యుగంధరి, ఉల్లి మొదలగువానికి ధర హెచ్చును.

(వైశాఖే) శ్లో॥ రసకార్పాసతైలానాం ఘృతగోధుమతండులాః।
ధాన్యముద్గచణాదీనా మత్యర్ఘంరాధపూర్ణిమాత్॥

తా॥ వైశాఖ పూర్ణిమ విశాఖా నక్షత్రముతోఁ గూడినయెడల రసము, దూది. తైలము, నేయి, గోధుమలు, బియ్యము, ధాన్యము, పెసలు, శనగలు వీటికి ధర హెచ్చును.

(జ్యేష్ఠే) శ్లో॥ రసద్రవ్యాణి సర్వాణి శూకధాన్యాని సర్వశః ।
లాక్షాకర్పూరకాంస్యాని మహార్ఘం జ్యేష్ఠపూర్ణిమాత్ ॥

తా॥ జ్యేష్ఠ పూర్ణిమ జ్యేష్ఠానక్షత్రముతోఁ గూడినయెడల రసద్రవ్యములన్నియును, ముల్లుతోగూడినధాన్యములును, లక్క, కర్పూరము, కాంస్యము వీటికి ధర హెచ్చును.

(ఆషాఢే) శ్లో॥ ధాన్యకార్పాసహేమాని గుడమాషతిలానిచ ।
మరీచికాదిద్రవ్యాణి మహార్ఘంశుచిపూర్ణిమాత్ ॥

తా॥ ఆషాఢ పూర్ణిమనాఁడు పూర్వాషాఢానక్షత్రము సంభవించినయెడల ధాన్యము, దూది, బంగారము, బెల్లము, మినుములు, తిలలు, మిరియాలు వీటికి ధర హెచ్చును.

(శ్రావణే) శ్లో॥ తువరీశర్కరాదీని పిప్పలీపూగమాలికాః (మల్లికాః) ।
కార్పాసతైలధాన్యాని మహార్ఘంస్యాత్తుశ్రావణే ॥

తా॥ శ్రావణ పూర్ణిమ శ్రవణా నక్షత్రముతోఁ గూడినయెడల తువరీధాన్యము, పంచదార, పిప్పళ్లు, పోకలు, మాలికలు (మల్లెలు), దూది, తైలము వీటికి ధర హెచ్చును.

(భాద్రపదే) శ్లో॥ ధాతవస్సర్వధాన్యాని మూలజాత్యాంచసర్వశః ।
ఆరక్తచణకాదీని మహార్ఘంభాద్రపూర్ణిమాత్ ॥

తా॥ భాద్రపద పూర్ణిమ పూర్వాభాద్రానక్షత్రముతోఁ గూడినయెడల రత్నములు, ధాన్యములన్నియు, అన్నివిధములయిన మూలములు, రక్తధాన్యములు, శనగలు వీటికి ధర హెచ్చును.

(ఆశ్వయుజే) శ్లో॥ మాషముద్గఘృతాదీని మణిమాక్తికవాససాం ।
భుక్తియోగ్యఫలంసర్వం అర్ఘవృద్ధ్యాశ్విపౌర్ణిమాత్ ॥

తా॥ ఆశ్వియుజ పూర్ణిమనాఁడు అశ్వినీ నక్షత్రము సంభవించిన యెడల మినుములు, పెసలు, నేయి, మణులు, ముత్తెములు, వస్త్రములు, భుజించదగిన ఫలములు వీటికి ధర హెచ్చును.

(కార్తికే) శ్లో॥ వ్రీహిగ్యవాశ్చచణకా ఆరసద్రవ్యధాతవః ।
తిలతైలగుడక్షారా మహార్ఘంచోర్జపూర్ణిమాత్ ॥

తా॥ కార్తీకపూర్ణిమ కృత్తికా నక్షత్రముతో గూడినయెడల ధాన్యము, యవలు, శనగలు, రసద్రవ్యములు, రత్నములు, తిలలు, నూనె, బెల్లము, ఉప్పు వీటికి ధర హెచ్చును.

(మార్గశీర్షే) శ్లో॥ సూత్రకార్పాస ధాన్యాని రసద్రవ్యాణి ధాతవః ।
కంబలాదిగజాశ్వాశ్చ మహార్ఘంమార్గపూర్ణిమాత్ ॥

తా॥ మార్గశీర్ష పూర్ణిమ మృగశీర్షానక్షత్రముతో గూడినయెడల నూలు, ప్రత్తి, ధాన్యములు, రసద్రవ్యములు, రత్నములు, కంబలములు, ఏనుగులు, గుఱ్ఱములు వీటికి ధర హెచ్చును.

(పుష్యే) శ్లో॥ స్వర్ణ సూత్రంచ కార్పాసం తిల తైలాశ్చ తండులాః ।
కుసుంభశ్శ్యామకౌశేయా మహార్ఘంపుష్యపూర్ణిమాత్ ॥

తా॥ పుష్యపూర్ణిమ పుష్యమీ నక్షత్రముతో గూడినయెడల బంగారము, నూలు, దూది, తిలలు, నూనె, బియ్యము, గులాబిరంగు, చామలు, పట్టువస్త్రములు వీటికి ధర హెచ్చును.

(మాఘే) శ్లో॥ మరీచా గోధుమా శ్శాలీ ముద్గ మాష యవాదికం ।
ధాతవస్సర్వధాన్యాని మహార్ఘంమాఘపౌర్ణిమాత్ ॥

తా॥ మాఘ పూర్ణిమ మఘానక్షత్రముతో గూడినయెడల మిరియాలు, గోధుమలు, వడ్లు, పెసలు, మినుములు, యవలు, రత్నములు, ధాన్యములన్నియు వీటికి ధర హెచ్చును.

(ఫాల్గుణే) శ్లో॥ మాషముద్గాదిసకలం లశునంసైంధవంతథా ।
కార్పాస తండులాదీని మహార్ఘంఫాల్గునేభవేత్ ॥

తా॥ ఫాల్గుణపూర్ణిమ పూర్వఫల్గుణీ నక్షత్రముతో గూడినయెడల మినుములు, పెసలు, ఉల్లి, లవణము, దూది, బియ్యము వీటికి ధర హెచ్చును.

అథ గ్రహయోగవశాత్ అర్ఘనిర్ణయః.

శ్లో॥ వృశ్చికస్థోయదారాహుః దైవాత్ భౌమస్యసంగమః ।
తదాజ్ఞాత్వాచకర్తవ్యం సంగ్రహోఘృతవాససామ్ ॥

తా॥ రాహువు వృశ్చికమందుండగా వానితో కుజుఁడు గు
యెడల నేయికి, వస్త్రములకు ధరహెచ్చునుగాన కొనియుంచవ

శ్లో॥ యత్రరాశౌరవిస్సిత్వా తత్రశుక్రోయదాస్థితః ।
వాతశ్చభవతేదీర్ఘం సర్వంహ్యర్ఘసమన్వితమ్ ॥

తా॥ రవియున్నరాశికి శుక్రుఁడు వచ్చినప్పుడు పెద్ద గాలివీచ
సమస్తద్రవ్యములకు ధరహెచ్చును.

శ్లో॥ ఏకరాశిగతాహ్యేతే సౌమ్యశుక్రదినాధిపాః ।
సర్వధాన్యమహార్ఘత్వం మేఘాస్స్వల్పజలప్రదాః ॥

తా॥ బుధ శుక్ర రవులు ఏకరాశిగతులైనయెడల సర్వధాన
లకు ధరహెచ్చును వర్షము తక్కువగనుండును.

శ్లో॥ మకరస్థో యదాజీవః కరోతివక్రగామితాం ।
ఆరోగ్యంకురుతేధాన్యం సమార్ఘంనాత్రసంశయః ॥

తా॥ గురువు మకరరాశియందు వక్రించినయెడల ఆరోగ్య
సమార్ఘముగలుగును.

శ్లో॥ శుక్రస్య రాశిమారభ్య చతురష్టస్థితేశనౌ ।
వృష్టియోగోభవేత్తావత్ మధ్యేహ్యారోహ్యనర్ఘదః ॥

తా॥ శుక్రునకు ४-८ స్థానములందు శనియున్నయెడల వర్ష
కురియును. వీరిద్దరిమధ్యను కుజుఁడున్నయెడల ధరలుతగ్గును.

శ్లో॥ అమావాస్యాంతులేచంద్రే మకరేచేత్తుమంగళః ।
వినాచక్రంభవేచ్ఛాన్నం వాణిజ్యంనిష్ఫలంభవేత్ ॥

తా॥ అమావాస్యనాఁడు చంద్రుఁడు తులయందుండగా కుజు
మకరమందున్నయెడల సర్వనాశనమగును. ధరలుతగ్గును.

శ్లో॥ స్వర్ణరూప్యాదిధాతూనాం మణిముక్తికవాససాం ।
ధాన్యాంమహార్ఘతాంయాతి ధనిష్ఠాయాంశనైశ్చరే ॥

తా॥ శని ధనిష్ఠయందుండగా బంగారము, వెండి, రత్నము
మణులు, ముత్యాలు, వస్త్రములు, ధాన్యము వీటికి ధర హెచ్చు

శ్లో॥ తైలంగోధుమమద్యాది ధూమ్రమరీచపూగకం ।
నాగవల్లీచధాన్యాని మహార్ఘంవారుణేశనౌ ॥

తా॥ శని శతభిషా నక్షత్రమందున్నయెడల నూనె, గోధుమలు, పొగాకు, వక్కలు, తమలపాకులు, ధాన్యములకుధర హెచ్చును.

శ్లో॥ విశాఖాయాంయవశ్శాలీ గోధూమాముద్గరాజతా ।
మసూరాన్నమకుష్టాచ మహార్ఘంరాహువేధతః ॥

తా॥ శని విశాఖయందుండగా రాహువేధగలిగినయెడల యవలు ధాన్యము, గోధుమలు, పెసలు, వెండి, చిరుశనగలు, బియ్యము వీటికి ధర హెచ్చును.

శ్లో॥ రాధాయాంతువరీసర్వ ద్విదళాన్నంచతండులాః ।
రజతాదిమహార్ఘంచ స్వర్భానుసహితాఇమే ॥

తా॥ శని అనూరాధయందు రాహువుతో గూడినయెడల తువరీ ధాన్యము, పెసలు, మినుములు, కందులు మొదలగు ద్విదళధాన్యములు, బియ్యము, వెండి వీటికి ధర హెచ్చును.

శ్లో॥ శాల్యాదిశుష్కధాన్యాని తిలతైలగుడాజ్యకం ।
ఫలపుష్పసుగంధీని మహార్ఘంచకుజోదయాత్ ॥

తా॥ కుజోదయమందు శాలిధాన్యము మొదలగు పొట్టుతోగూడిన ధాన్యము, తిలలు, నూనె, గుడము, ఫలములు, పుష్పములు, గంధము వీటికి ధరహెచ్చును.

శ్లో॥ మీనరాశిగతేమందే వక్రచారేవిశేషతః ।
ధాన్యాదిసకలంవస్తు మహార్ఘంయదిజాయతే ॥

తా॥ శని మీనమందు వక్రించినయెడల సమస్తవస్తువులకు ధర హెచ్చును.

శ్లో॥ భౌమక్షేత్రగతేశుక్రే యదావక్రోదయాస్తగే ।
తదాభవతిమేదిన్యాం ధాన్యాదీనాంమహార్ఘతా ॥

తా॥ శుక్రుడు కుజక్షేత్రములగు మేషవృశ్చికములందుండివక్రించినను,యుదయించినను, అస్తమించినను ధాన్యాదులకుధర హెచ్చును.

శ్లో॥ యస్మిన్వర్షేయదామాసే చత్వారఃపంచఖేచరాః ।
వక్రస్యాస్తోదయప్రాప్తే మహార్ఘంరాజవిగ్రహమ్ ॥

తా॥ ఏలగ్నమందైనను, నాలుగు లేక ఐదు గ్రహములు వక్రిం

చినను, అస్తమించినను, ఉదయించినను ధర హెచ్చును. రాజులకు యుద్ధముగల్గును.

## గ్రహావయోగములు.

శ్లో॥ రేవత్యాంతగతస్సౌరి స్తదాదేవోనవర్షతి ।
హాహాకారంమహారౌద్రం పృథివ్యాంజాయతేశివే ॥

తా॥ శని రేవతి చివరభాగమందున్న యెడల వర్షముకురియదు. భూమి అంతటను హాహాకారముగలుగును.

శ్లో॥ యదావృశ్చికరాశిస్థః సౌంహికేయోపిజాయతే ।
మనోద్దిష్టఫలంచాపి షష్ఠేమాసేచరౌరవమ్ ॥

తా॥ రాహువు వృశ్చికరాశియందున్నపుడు యిష్టార్థములు చేకూరును. ఆఱుమాసములతఱువాత భయము గలుగును.

శ్లో॥ యదారాహుస్తులేయాతి క్రూరఃక్రూరసమన్వితః ।
మేదిన్యాంసస్యనాశస్స్యాత్ దుర్భిక్షంతత్రదారుణమ్ ॥

తా॥ రాహువు తులయందున్నపుడు పాపగ్రహసంబంధ ముండిన యెడల సస్యములునశించును. దుర్భిక్షము అనఁగా కరువుగలుగును.

శ్లో॥ కుంభరాశిగతేజీవే మేఘస్స్వల్పాంబువర్షతి ।
కృషినాశంచదుర్భిక్షం పూర్వదేశేమహర్ఘతా ।

తా॥ గురువు కుంభరాశినిబొందినప్పుడు స్వల్పవర్షముకురియును. సస్యములు నశించును. తూర్పుదేశమందు కరువుగలుగును.

శ్లో॥ శ్రవణేచధనిష్ఠాయాం శతర్క్షాయాంయదాగురుః ।
క్షేమంకుశలమారోగ్యం సుభిక్షంచవినిర్దిశేత్ ॥

తా॥ గురువు శ్రవణ, ధనిష్ఠ, శతభిషములందున్నప్పుడు క్షేమము, ఆరోగ్యముగలుగును.

శ్లో॥ మీనాంతేవృశ్చికాంతేచ వృషకుంభాళిమధ్యయోః ।
యావదాస్తేగురుస్సౌరిః తావద్దుర్భిక్షమాచరేత్ ॥

తా॥ గురువు, శనియు మీన వృశ్చికముల చివరభాగమందును, వృషభ, కుంభ, తులల మధ్యభాగమందునువున్నప్పుడు. కరువుకల్గును.

శ్లో॥ వృశ్చికే వృషభే సింహే మీనే ధనుషివక్రగే ।
భూమిజోరవిజస్తిష్ఠేత్ వృష్టేస్సస్యవినాశనమ్ ॥

తా॥ కుజ శనులు వృశ్చిక, వృషభ, సింహ, మీన, ధనుస్సు లందు వక్రించినయెడల సస్యనాశముగల్గును.

శ్లో॥ ప్రావృట్కాలేయదాభౌమః సింహరాశిగతోయది ।
వృష్టినాశంమహాఘోర మరక్తాత్సర్వదుర్లభమ్ ॥

తా॥ వర్షాకాలమందు కుజుఁడు సింహరాశియందున్నయెడల అనావృష్టియు, ఘోరమున్నూ గలుగును.

శ్లో॥ భూమిజస్సురమంత్రీచ సమసప్తకమాశ్రితౌ ।
అవంతీలంకయోర్మధ్యే క్షుధాశస్త్రభయంనృణామ్ ॥

తా॥ కుజుఁడున్నూ, గురువున్నూ సమసప్తకము నొందినయెడల లంకాపట్టణ – ఉజ్జయినీపట్టణముల మధ్యను కరువున్నూ, యుద్ధములున్నూ గలుగును. (సమసప్తకమనఁగా వానికి యేఁడవరాశియందు వీఁడును, వీనికి యేఁడవరాశియందు వాఁడును సంచరించుట)

శ్లో॥ ఏకరాశౌచ తేమిత్రే శనిభౌమాంగిరస్సుతాః ।
ప్రజాపీడాభవేన్నిత్యం దుర్భిక్షంరాజవిగ్రహమ్ ॥

తా॥ కుజ- గురు- శనులు ఏకరాశియందుండినగాని, సమసప్తకమందుండినగాని ప్రజలకు పీడయును, కరువులును, యుద్ధములును గలుగును.

శ్లో॥ రాహురంగారకశ్చైవ రాశిఋక్షగతౌతథా ।
మహాభయంచసస్యానాం నచవృష్టిఃప్రజాయతే ॥

తా॥ రాహువున్నూ, కుజుఁడున్నూ యేకరాశినిగాని, యేకనక్షత్రమునుగాని బొందినయెడల సస్యనాశముగలుగును. వర్షము కురవదు.

శ్లో॥ మేషేచభపతేభానుః వృషేభూమిసుతస్యచ ।
నృపతేశ్చభవేద్వ్యాధిః లోకానాంచమహద్భయమ్ ॥

తా॥ రవి మేషమందును, కుజుఁడు వృషభమందు నున్నయెడల రాజులకు రోగములున్నూ, ప్రజలకు భయములున్నూ గలుగును.

శ్లో॥ శుక్రసౌమ్యమహీపుత్రాః క్రమా త్సూర్యాగ్రతస్థితాః ।
వృష్టినాశోభవేద్వ్యాధిః భూరిలోకేభయంకరాః ॥

తా॥ కుజ, బుధ, శుక్రులు రవికి ముందర నున్నయెడల వర్షము కురవదు. భయముగలుగును.

శ్లో॥ కుజస్తుపురతోగచ్ఛేత్ భానుభార్గవయోరపి ।
తుషారవృష్టిఃపర్జన్యః వర్షస్స్యాత్ఖండమండలే ॥

తా॥ రవి శుక్రులకు ముందఱ కుజుఁడున్నయెడల తుషారవర్షము కురియును. ఖండవృష్టిగలుగును.

శ్లో॥ బుధభార్గవయోర్మధ్యే రవౌభౌమేచతిష్ఠతి ।
అతివాయురనావృష్టి ర్భూమిలోకేభయంకరా ॥

తా॥ బుధ శుక్రుల మధ్యను రవి కుజు లున్నయెడల అతివాయువున్ను, అనావృష్టియు గలిగి భయముగల్గును.

శ్లో॥ సూర్యస్యపురతోగచ్ఛే ద్యదాశుక్రో బుధోపివా।
వర్షాకాలేనసందేహః తదావృష్టిర్నిరంతరమ్ ॥

తా॥ రవికి ముందఱ బుధుఁడుగాని, శుక్రుఁడుగాని యున్నయెడల వర్షాకాలమందు తప్పక వర్షించును.

శ్లో॥ బుధభార్గవయోర్మధ్యే రవిభౌమేందుసంగమం ।
అతివాయుశ్శిలాపాతం జలపాతంమహీతలే ॥

తా॥ బుధ శుక్రుల మధ్యను రవి చంద్ర కుజులున్నయెడల అతివాయువున్ను, రాళ్ళవానయు, పెద్దవర్షమున్ను గలుగును.

శ్లో॥ యదాకుజస్యపురత స్సంచ రేద్భృగునందనః ।
వృష్టియోగంప్రకుర్వీత మేదినీసుఖభాగ్భవేత్ ॥

తా॥ అంగారకుని ముందఱ శుక్రుఁడున్నయెడల వర్షము కురియును. సుఖముగలుగును.

శ్లో॥ ఏకరాశౌయదాయాంతి రవిచంద్రజభూమిజాః ।
స్వల్పవృష్టిఃప్రజానాశం నృపతేఃకలహోత్సవః ॥

తా॥ రవి బుధ కుజులు యేకరాశిగతులైనయెడల స్వల్పవర్షము కురియును. జననాశనమును, యుద్ధములును గలుగును.

శ్లో॥ అర్కేణసహితేసౌమ్యే పురో౽ంగారశ్చకథ్యతే ।
అతివాయురనావృష్టిః సముద్రమపిశోషయేత్ ॥

తా॥ సూర్యునితో బుధుఁడు గూడియుండఁగా ముందఱ కుజుఁడున్నయెడల అతివాయువు, అనావృష్టియు గల్గును. సముద్రజలము కూడా యింకిపోవును.

శ్లో॥ యుగ్మరాశౌయదాయాంతి భౌమశ్చాసంగతోయది ।
తదావర్షంతిజీమూతాః భవితావృష్టికృత్కుజః ॥

తా॥ మిథునమందు సూర్య బుధ కుజులు గూడినయెడల వర్షము కుఱియును.

శ్లో॥ బుధభార్గవయోర్మధ్యే భౌమేతిష్ఠతి వాయవః ।
సూర్యస్యపురతోభౌమః నీహారమనువర్షతి ॥

తా॥ బుధ శుక్రుల మధ్యను కుజుఁడున్నయెడల వాయువుగల్గును. రవికి ముందఱ కుజుఁడున్నయెడల మంచుకుఱియును.

శ్లో॥ మఘాదిపంచకర్క్షేతు పశ్చిమాశాగతేభృగౌ ।
నమేఘానచవర్షాస్స్యుః చోరరోగభయాభువి ॥

తా॥ శుక్రుఁడు పశ్చిమదిక్కున మఘ, పూఫ, ఉఫ, హస్త, చిత్ర యీ అయిదునక్షత్రములందున్నయెడల వర్షముకురవదు. చోరబాధ, రోగబాధలు గలుగును.

శ్లో॥ శుక్రస్యరాశిమారభ్య చతురష్టస్థితేశనౌ ।
వృష్టియోగంభవేత్తావత్ మధ్యేక్రూరోహ్యనర్ఘదః ॥

తా॥ శుక్రునకు ౪-౮ స్థానములందు శని యున్నయెడల వృష్టియోగముగల్గును. శుక్ర శనుల మధ్యను క్రూరగ్రహమున్నయెడల ధరలు తగ్గును.

శ్లో॥ ఉత్తరాత్రియపుష్యర్క్షే బుధేచోదయగేసదా ।
తదావృష్టిర్భవేద్భూమౌ అన్యర్క్షేతీతిబాధకః ॥

తా॥ బుధుఁడు ఉత్తరాత్రియమందును, పుష్యమియందును నుదయించినయెడల వర్షముపుఱియును. ఇతర నక్షత్రములందయిన ఈతిబాధలు కలుగును,

శ్లో॥ బుధశుక్రేందుసంయోగో రవిభౌమాగ్రతస్థితః ।
మహతీవృష్టిర్లోకానాం గర్జితంమేఘసంకులమ్ ॥

తా॥ రవి కుజుల ముందఱ చంద్ర బుధ శుక్రులు కలిసియున్న యెడల నుఱుములతోఁగూడిన వర్షముకురిసెయును.

శ్లో॥ ఆదిత్యేగచ్ఛతివ్యాగ్రే పృష్ఠే భవతి భూసుతః ।
మధ్యే సోమసుతోయాతి సుభిక్షంతత్రదృశ్యతే ॥

తా॥ ముందఱ సూర్యుఁడును, వెనుక కుజుఁడును, మధ్య బుధుఁడును నున్నయెడల సుభిక్షముగలుగును.

శ్లో॥ శుక్రస్య సప్తమస్థానే శనిచంద్రాసమాశ్రితౌ ।
అతివృష్టిశ్చలోకానాం మేదినీసుఖభాగ్భవేత్ ॥

తా॥ శుక్రునకు సప్తమస్థానమందు శని చంద్రుల్లున్నయెడల అతివృష్టిగల్గును. భూమి సుఖముగానుండును.

శ్లో॥ బుధశుక్రద్వయోర్మధ్యే యదాచరతిభాస్కరః ।
వృష్టినాశోభవేద్వ్యాధిః లోకానాంచమహద్భయమ్ ॥

తా॥ బుధ శుక్రులమధ్య రవి యున్నయెడల వర్షము కురువదు. భయము కలుగును.

శ్లో॥ యదాస్వాతీత్రయేశుక్రః పశ్చిమాయాంపరివర్తతే ।
సుఖినస్సర్వలోకాశ్చ సువృష్టిస్సస్యసంపదః ॥

తా॥ శుక్రుఁడు పశ్చిమదిక్కున స్వాతి, విశాఖ, అనూరాధలయందున్నయెడల లోకములకు సుఖముగలుగును. సస్యములు ఫలించును. వర్షము కురిసెయును.

శ్లో॥ ఏకరాశిగతాహ్యేతే సౌమ్యశుక్రదినాధిపాః ।
సర్వధాన్యమహార్ఘత్వం మేఘాస్స్వల్పజలప్రదాః ॥

తా॥ రవి, బుధ, శుక్రులు యేకరాశిగతులయినయెడల వర్షము తక్కువ, ధరలు హెచ్చును.

శ్లో॥ యదాస్వాతీత్రయేశుక్రః ప్రాక్సంస్థేతుపరివర్తతే ।
తదా వృష్టివినాశంచ పశు భూపాలపీడనమ్ ॥

తా॥ శుక్రుఁడు తూర్పుదిక్కున స్వాతి, విశాఖ, అనూరాధలయం

దున్నయెడల వర్షము కురువదు, పశువులు నశించును, రాజులకు యుద్ధములు కలుగును.

శ్లో॥ ఉదయాస్తమయంచైవ యదాశుక్రస్సమాగతః ।
జ్యేష్ఠాదిపంచకర్క్షేతు దుర్భిక్షంసర్వభూమిషు ॥

తా॥ జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణము యీ అయిదు నక్షత్రములందును శుక్రునకు ఉదయాస్తమయములు గలిగినయెడల సమస్తభూములందును కరువుగలుగును.

శ్లో॥ జ్యేష్ఠేమాఘోర్జమార్గేచ శ్రావణేచోదయాస్తగం ।
భృగుఃకరోత్యనావృష్టిః జనాస్సర్వేక్షుధాతురాః ॥

తా॥ శుక్రుడు జ్యేష్ఠ, మాఘ, కార్తీక, మార్గశీర్ష, శ్రావణ మాసములందు ఉదయాస్తమయముల నొందినయెడల వర్షముకురవదు కరువు గలుగును.

శ్లో॥ ఆదిత్యేగచ్ఛతిప్యాగ్రే పృష్ఠేభవతిభార్గవః ।
మధ్యే సోమసుతస్తత్ర దుర్భిక్షంతత్రజాయతే ॥

తా॥ ముందట సూర్యుడు వెనుక శుక్రుడు, మధ్యను బుధుడు నున్నయెడల కరువుగలుగును.

శ్లో॥ మీనాంతేచయదాసౌరిః కుంభమధ్యేచవాక్పతిః ।
సంచరేత్సర్వలోకానాం సంభవేత్ప్రళయోపమమ్ ॥

తా॥ శని మీనముయొక్క చివరభాగమందును, గురువు కుంభ మధ్యను యున్నయెడల ప్రళయసమానభయము గలుగును.

శ్లో॥ రవిర్గురుస్తథాసౌమ్యః త్రిభిశ్చంద్రసమాగమే ।
జలపాతంమహాఘోరాద్రిం ఇత్యుక్తంబ్రహ్మయామళే ॥

తా॥ రవి, బుధ, గురువులతో చంద్రుడు గూడినయెడల జల పాతము గలుగును.

## తిథి వార నక్షత్ర యోగాః.

శ్లో॥ చైత్రమాసేకృష్ణపక్షే తిథివృద్ధిర్యదాభవేత్ ।
శుక్లపక్షస్యహానిస్స్యాత్ అన్నహీనాతదాభువి ॥

తా॥ చైత్రమాసమున కృష్ణపక్షమందు తిథివృద్ధియు, శుక్లపక్ష మందు తిథిక్షయమును గలిగినయెడల కరువుగలుగును.

శ్లో॥ చైత్రశుక్లస్యపంచమ్యాం రోహిణీయదిసంయుతా ।
పజావృద్ధిస్సుభిక్షంచ మేదినీసుఖభాగ్భవేత్ ॥

తా॥ చైత్రశుక్ల పంచమియందు రోహిణీనక్షత్రము గూడిన యెడల ప్రజావృద్ధియు, సుభిక్షమున్నూ గలుగును.

శ్లో॥ వైశాఖధవళాష్టమ్యాం శనివారోభవేద్యది ।
జలశోషం ప్రజానాశం ఛత్రభంగం తదాదిశేత్ ॥

తా॥ వైశాఖ శుక్ల అష్టమినాడు శనివారము గూడినయెడల జలము యెండిపోవును, ప్రజలునశింతురు ఛత్రభంగము గలుగును.

శ్లో॥ అమావాస్యాంచవైశాఖే కృత్తికాయాంజలాల్పతా ।
చౌరాలుఠంతిమార్గేషు రాజ్ఞాంయుద్ధంపరస్పరమ్ ॥

తా॥ వైశాఖామావాస్యనాడు కృత్తికానక్షత్రము గూడినయెడల వర్షముతక్కువ, చోరభయము, యుద్ధముకలుగును.

శ్లో॥ పంచార్కయోగోవైశాఖే వృష్టిరోధోభవిష్యతి ।
అక్షయాఖ్యతృతీయాయాం సుభిక్షాయైవరోహిణీ ॥

తా॥ వైశాఖమాసమందు అయిదు ఆదివారములు గలిగినయెడల వర్షముకురవదు. వైశాఖ శుక్ల తృతీయనాడు రోహిణీనక్షత్రము గలిగిన యెడల సుభిక్షము గలుగును.

శ్లో॥ జ్యేష్ఠ కృష్ణప్రతిపది సోమవారేణసంయుతా ।
అతివృష్టిశ్చలోకానాం సుభిక్షస్సర్వసంపదామ్ ॥

తా॥ జ్యేష్ఠ బహుళ పాడ్యమినాడు సోమవారము గలిగినయెడల అతివర్షము సుభిక్షము గలుగును.

శ్లో॥ ఆషాఢపూర్ణిమాయాశ్చ యదావృద్ధిర్భవిష్యతి ।
మాసత్రయంసుభిక్షంచ పశ్చాద్దుర్భిక్షపూరితాః ॥

తా॥ ఆషాఢ పూర్ణిమాతిథికి వృద్ధిగలిగినయెడల మూడుమాస ములవఱకు సుభిక్షము తరువాత దుర్భిక్షముగలుగును.

శ్లో॥ త్రింశద్ఘటీభిరాషాఢ్యాం పౌర్ణిమాఘటికాయది ।
సుఖంషాణ్మాసపర్యంతం పరందుఃఖంచమేదినీ ॥

తా॥ ఆషాఢ పూర్ణిమ 30 ఘటికలకు మీద యొక్క ఘటిక యున్నను ఆఱుమాసములవఱకు సుఖము తఱువాత దుఃఖముకల్గును.

శ్లో॥ శ్రావణేశుక్లపక్షస్య తిథిఃక్షయీభవేత్ ।
తథానైకార్తికేమాసి ఛత్రభంగంప్రజాయతే ॥

తా॥ శ్రావణ శుక్లపక్షమందు యొక్క తిథి క్షయమునుబొంది కార్తికశుక్లమందును తిథిక్షయించినయెడల ఛత్రభంగము అనఁగా రాజునకు హానిగలుగును.

శ్లో॥ శ్రావణేపూర్ణిమాయాంచ శ్రవణేమోదితాభువి ।
సుభిక్షంక్షేమమారోగ్యం కురుతేనాత్రసంశయః ।

తా॥ శ్రావణ శుక్ల పూర్ణిమనాడు శ్రవణానక్షత్రము గలిగిన యెడల దేశము సుభిక్షముగానుండును.

శ్లో॥ భృశంజలోద్ధుతామేఘాః కృషీణాంభూర్యుపద్రవాః ।
తస్కరోపద్రవానిత్యం అమాభాద్రేభృగోర్దినాత్ ॥

తా॥ భాద్రపదామావాస్యనాడు శుక్రవారము సంభవించిన యెడలవర్షమధికము, చోరులు మొదలగు యుపద్రవములు అధికము గలుగును.

శ్లో॥ కార్తికేపంచమీరౌద్రి యోగేస్యాత్తృణసంగ్రహః ।
అశ్వనీభరణీయుక్త పౌర్ణమీరుగ్భయార్తిదాః ॥

తా॥ కార్తీక పంచమినాడు ఆరుద్ర నక్షత్రము వచ్చినయెడల తృణసంగ్రహము చేయవలెను. పూర్ణిమనాడు అశ్వినీ భరణులు గూడినయెడల రోగములుగలుగును.

శ్లో॥ ఆశ్వినేప్రథమాయాంచే చ్ఛుక్లాయాంచగతేశనౌ ।
తదాధాన్యంచవిక్రేయం పురస్తాత్ స్యాత్సమార్ఘతా ॥

తా॥ ఆశ్వయుజ శుక్ల ప్రతిపత్తునాడు శనివారము గలిగినయెడల వెంటనే ధాన్యము అమ్మవలయును తరువాత ధరతగ్గును.

శ్లో॥ ఏకాదశ్యాంమార్గశుక్లే శనివారోయదాభవేత్ ।
జలశోషంప్రజానాశం ఛత్రభంగంవినిర్దిశేత్ ॥

తా॥ మార్గశీర్ష శుక్లైకాదశినాఁడు శనివారము గలిగినయెడల జలము శోషించును. ప్రజాక్షయము, ఛత్రభంగము గలుగును.

శ్లో॥ పౌషకృష్ణదశమ్యాంస్యా ద్విశాఖానిశివాదివా ।
భావివర్షేఽంబుదాఃప్రోక్తాః సత్యంసత్యంనచాఽన్యథా ॥

తా॥ పుష్యబహుళ దశమినాఁడు రాత్రిగాని, పగలుగాని విశాఖ నక్షత్రము సంభవించినయెడల ముందుసంవత్సరమందు మేఘములు బాగానుండును.

శ్లో॥ యదాపౌషేత్వమాయాంచ తదావిశ్వర్క్షమాగతే ।
జనభూపాలనాశంచ రోగదుర్భిక్షమాహవాత్ ॥

తా॥ పుష్య బహుళామావాస్యనాఁడు ఉత్తరాషాఢ నక్షత్రము గలిగినయెడల జననాశనమున్ను, రాజనాశనమున్ను, రోగములున్ను, దుర్భిక్షమున్ను గలుగును.

శ్లో॥ యదావై మాఘమాసేచ పంచమందార్కవాసరాః ।
దుర్భిక్షయుద్ధభీతానాం లోకానాంచప్రపీడితాః ॥

తా॥ మాఘమాసమందు అయిదు శనివారములు, అయిదు ఆదివారములు గలిగినయెడల కరువు, యుద్ధములు గలుగును.

శ్లో॥ మాఘేచమాసేరవిజేకుజేవా భవేదమాశీతకరప్రియావా ।
లోకస్యశోకఃక్షితిపాలలోకః పరస్పరంయుద్ధ్యతిశస్త్రసంఘైః॥

తా॥ మాఘమాసమందు అమావాస్యనాఁడు రవి చంద్ర కుజ వారములలో నొకవారము గలిగినయెడల జనదుఃఖము, రాజులకు యుద్ధములును గలుగును.

శ్లో॥ ఫాల్గునేచత్రయోదశ్యాం శుక్లాయాంయది భార్గవః ।
జ్యేష్ఠేరోగాయమానంస్యాత్ భోగోమాసత్రయేధరా ॥

తా॥ ఫాల్గుణ శుక్ల త్రయోదశినాఁడు శుక్రవారము గల్గినయెడల జ్యేష్ఠమాసమందు రోగములు గలుగును. తరువాత మూఁడు నెలలు సుఖముగానుండును.

శ్లో॥ ఫ ల్గునేచగురోోర స్తం వక్రిహాయదిజాయ తే ।
తదాసస్యమహార్ఘత్వం భయభీతాచమేదినీ ॥

తా॥ ఫాల్గుణమాసమందు గురువుకు అస్తమానముగాని, వక్రము గాని కలిగినయెడల ధరలు హెచ్చును. భయముకలుగును.

శ్లో॥ యస్మిన్ సంవత్సరేయావ ద్దశమీారవివాసరః ।
ఘటీప్రమాణమాలోక్య శివేధాన్యస్యవిక్రియః ॥

తా॥ దశమీ భానువారమునాఁడు ఘటికలు లెక్కించి ఆసంఖ్య మాసములకు ధాన్యమును విక్రయించవలెను.

శ్లో॥ పంచచంద్రాశ్చవారేణ యదాచైత్రేయుతాతదా ।
బహులావృష్టిసస్యాని మేదినీసుఖభాగ్భవేత్ ॥

తా॥ చైత్రమాసమందు అయిదు సోమవారములు వచ్చినయెడల సుభిక్షము గలుగును.

శ్లో॥ రాధాకృష్ణప్రతిపది యదాబుక్షేఽల్పమాగతా ।
జలశోషంప్రజానాశం ఛత్రభంగంతదాదిశేత్ ॥

తా॥ వైశాఖ శుక్ల పాడ్యమినాఁడు నక్షత్రము అల్పముగానున్న యెడల జననాశనము, ఛత్రభంగము గలుగును.

శ్లో॥ మృగేశుక్లద్వితీయేచ అమావాస్యాంచరోహిణీ ।
యదాస్యాన్మాధవేమాసే లోకదుర్భిక్షమావహః ॥

తా॥ వైశాఖశుక్లవిదియనాఁడు మృగశీర్షానక్షత్రమున్ను, అమావాస్యనాఁడు రోహిణీనక్షత్రమున్ను గలిగినయెడల దుర్భిక్షముగల్గును

శ్లో॥ భౌమస్యపంచవారాస్తు వైశాఖేసంభవంతిహి ।
వృష్టిరోధోఽగ్నిభీతిశ్చ ధరారక్తసమాన్వితా ॥

తా॥ వైశాఖమాసమందు అయిదు మంగళవారములు గలిగిన యెడల వర్షముండదు. అగ్నిభయము యుద్ధము గలుగును.

శ్లో॥ జ్యేష్ఠస్యప్రథమేపక్షే యాతిథిఃప్రథమాభవేత్ ।
సోమపుత్రేణదుర్భిక్షం ఖండవృష్టిఃప్రజాయతే ॥

తా॥ జ్యేష్ఠమాసమందు శుక్ల పాడ్యమినాఁడు సోమవారము గలిగినయెడల ఖండవృష్టి, కరువు గలుగును.

శ్లో॥ జ్యేష్ఠేమూలేపూర్ణిమాయాం శుభంవర్షహితాయచ ।
షష్ఠేచంద్రేఽహ్నిసంయుక్తమార్ద్రాయాంజలశోషణమ్ ॥

తా॥ జ్యేష్ఠ పూర్ణిమనాఁడు జ్యేష్ఠానక్షత్రముగాని, మూలానక్షత్రముగాని గలిగినయెడల వర్షము కురియును. శుభము గలుగును. షష్ఠినాఁడు సోమవారము ఆర్ద్రానక్షత్రము గలిగినయెడల వర్షము కురువదు.

శ్లో॥ శుచిశుక్లాద్యదివసే ద్వితీయాదిత్యపుష్యజే ।
శాకాచిత్రాష్టకేయుక్తే దుర్భిక్షాఖ్యయమాదిశేత్ ॥

తా॥ ఆషాఢ శుక్ల పాడ్యమినాఁడుగాని, విదియనాఁడుగాని పునర్వసుగాని, పుష్యమిగాని వచ్చినను, క్రమముగా పునర్వసు, పుష్యములు వచ్చినను, అష్టమినాఁడు చిత్రానక్షత్రము గలిగినను కరువు గలుగును.

శ్లో॥ ఆషాఢశుక్లపంచమ్యాం సౌమ్యవారోభవేద్యది ।
సంపూర్ణానిఖిలాధాత్రీ ధనధాన్యాకులాధరా ॥

తా॥ ఆషాఢ శుక్ల పంచమినాఁడు బుధవారముగలిగినయెడల ధనధాన్యములు సంపూర్ణముగానుండును.

శ్లో॥ శ్రావణేపంచమందాశ్చ వారాదుర్భిక్షమాకులం ।
ధాత్రీసంచలనాదీశ దేశభంగంజనార్తిదమ్ ॥

తా॥ శ్రావణమాసమందు అయిదు శనివారములు గలిగినయెడల కరువుగలుగును. దేశక్షోభమును, రోగములును గలుగును.

శ్లో॥ స్వాతీశుక్లేచసప్తమ్యాం శ్రావణేచసితేశనౌ ।
సప్తమీజలదాపూర్ణా సస్యవృద్ధినిరామయాః ॥

తా॥ శ్రావణ శుక్ల సప్తమినాఁడు స్వాతీనక్షత్రమున్ను, శనివారమున్ను గూడినయెడల సుభిక్షము, ఆరోగ్యము కలుగును.

శ్లో॥ యదాభాద్రపదేశుక్లే సప్తమీమైత్రసంయుతా ।
నవృష్టిఃనచపర్జన్యః జలానాముంచసర్వదా ॥

తా॥ భాద్రపదశుక్ల సప్తమినాఁడు అనూరాధానక్షత్రము వచ్చినయెడల వర్షము కురియదు. మేఘములుండవు.

శ్లో॥ సుభిక్షంక్షేమమారోగ్యం వర్షాయ ప్రబలోదయః ।
సస్యోత్పత్తిః ప్రజాసౌఖ్యం సోమే భాద్రపదాంత్యగే ॥

తా॥ భాద్రపదామావాస్యనాఁడు సోమవారము గూడినయెడల సుభిక్షము, క్షేమము, ఆరోగ్యము, సౌఖ్యము కలుగును.

శ్లో॥ షష్ఠ్యామథాశ్వినే జ్యేష్ఠాఽదిత్యమూలాభిసంగమే ।
సంగ్రహే సర్వధాన్యానాం పంచమాసే ఫలంవిదుః ॥

తా॥ ఆశ్వయుజశుక్ల షష్ఠినాఁడు జ్యేష్ఠగాని, మూలగాని- బహుళ షష్ఠినాఁడు పునర్వసుగాని సంభవించినయెడల ధాన్యమును కొని అయిదుమాసములకు అమ్మినచో లాభముగలుగును.

శ్లో॥ ఆశ్వినేకృష్ణపంచమ్యాం రవివారః ప్రవర్తతే ।
మాఘమాసేహ్యమావాస్యాం మహార్ఘంనిశ్చయంస్మృతమ్॥

తా॥ ఆశ్వయుజ బహుళ పంచమినాఁడు ఆదివారము వచ్చినచో మాఘామావాస్యకు ధర హెచ్చును.

శ్లో॥ కార్తికస్యసితేపక్షే పంచమీసోమవాసరః ।
నరనారీనృపాణాంచ సర్వత్రసుఖదోభవేత్ ॥

తా॥ కార్తీక శుక్ల పంచమినాఁడు సోమవారము గలిగినయెడల అందఱికి క్షేమముగల్గును.

శ్లో॥ భరణీకృత్తికాయోగే స్యాదూర్జేపౌర్ణిమాయది ।
షణ్మాసాత్పరతస్సౌఖ్యం పూర్వందుష్టాఽకులాభువి ॥

తా॥ కార్తిక పూర్ణిమనాఁడు భరణీ కృత్తికలు గూడినయెడల ఆఱుమాసములవఱకు కష్టములు, తఱువాత సుఖము కల్గును.

శ్లో॥ మార్గకృష్ణచతుర్థ్యాది తిథ్యస్త్రిసార్పభిస్త్రయే ।
సహితామహతీవృష్టిః త్ర్యహమాషాఢశుక్లకే ॥

తా॥ మార్గశిర బహుళ చవితి మొదలు మూఁడురోజులు ఆశ్లేష మొదలు మూఁడునక్షత్రములు కలిగినచో ఆషాఢమాసమందు శుక్ల పక్షమున మూఁడుదినములు వర్షించును.

శ్లో॥ నవమ్యాంమార్గచిత్రాయా మమాయాంతోయభేళనా ।
సర్వధాన్యమహార్ఘత్వం వైశాఖాద్యాభవంతిహి ॥

